మహర్షి దేవేంద్రనాథ ఠాగూరి

గారి ధర్మోపదేశములు



వేదాంతగ్రంథములు

The Theistic Mission Series. No. 2

"Brahma Krupahi Kevalam"

*Maharshi Devendranath Tagore's*

# SERMONS.

IN TELUGU

BY

SANKARA VENKATA RAMAYYA.

Author of "The Essays & Tracts"
"Our Present Situation" &
representative of "Desabhimani"
a Telugu daily of Guntur.

BEZWADA.

DURGA PRESS,
BEZWADA.

1909.

 Price 0-8-0



Printed by K. Veeramalliah Pantulu,
*Manager.*




# మహర్షి దేవేంద్రనాథ ఠాకురుగారి

# ధర్మోపదేశములు.

—— :o: ——

"సమస్తమునకంటెను తెలిసికొనను పూజింపను అర్హమైన యీశాశ్వతపురుషుని తెలిసికొనుము. మరణము నిన్ను బాధింపకుండు నట్లు ఆయనను శరణుజొచ్చుము"

ఈ ప్రపంచములో సమస్త ఆపదలలోను మరణము మిక్కిలి భీకరమైనది. మరణముయొక్క భయంకరరూపము యెదుట యెప్పుడుప్రత్యక్షముగానున్నది. లోకము మరణముయొక్క ప్రతిబింబమువాత్రమే యైయున్నది. ఇచ్చటపుట్టునదంతయు మరణమునకు లోబడినది. పెరుగునదంతయు క్షీణించునది. అనిశ్చయమైనట్టియు క్షణభంగురమైనట్టియు యీప్రపంచపదార్థములును, జీవితముయొక్క యెప్పుడును మారుచున్న స్థితులును, మరణమునుమాత్రమే మనకు జ్ఞాపకముచేయును మరణముయొక్క యీభయమునుండియు బాధనుండియు మనమెట్లుతప్పింపబడుదుము? మరణముయొక్క ఆకారము ప్రతిచోటను చూడబడును. అయితే మరణభయమునుండి శాశ్వతత్వమే తానుగాగల పర

యదేషఆకాశ ఆనందోనస్యాత్” ఆనందస్వరూపుడైన పరమేశ్వరుడు
మనబాహ్యాంతరములయందు లేకున్న యెవడు చలించియుండును, యె
వడుజీవించియుండును ఆయనయందరికినిసంతోషమునుకలిగించును మనజ
న్మముయొక్క మొదటిక్షణమునుండియు యెవనియొక్క ప్రేమవలనపెంచబ
డితిమో, శాశ్వతకాలము యెవనియొక్కరక్షణమున జీవించుటకు ఆశిం
చుచుంటిమో, అట్టిపరమేశ్వరుని మనము విడుతుమా? మనల నాయన
యేమరి యుండలేడు; మనమాయనను మరచిపోకుండ నుండవలదా!
మనవలన ఆయనయెప్పటికిని విడచిపెట్టబడకుండుగాక విరామములేక
ధర్మమును, భాగ్యమును, సౌఖ్యమును కలిగించెడి ఆయనను మనము వి
డుతుమా? అది మనుష్యునకు అర్హమైనపనియా? మరియు యేల మ
నమాయనను విడువవలయును? అది మనకు మేలుచేయునా? ఆయనర
క్షణములేక మనము జీవింపగలుగుటకు, యీజన్మములో మనము బా
ధపడనవసరములేదా, యీలోకములో మనకే యుపాయమును యేక
ష్టమునులేదా, మనశరీరము వ్యాధిబాధితముకాదా. మన మానసము
నిస్పృహత జెందలేదా? భయమునుండి మనల తొలగించెడి పాదముల
శరణమును చొరకుండుటకు యిక్కడ భీతియేమియులేదా? నిరాధారు
ల రక్షకుని శరణముచొరకుండుటకు యిచ్చట పాపమును దుఃఖము లే
వా? మనమానసములు బాధవలన కలవరపడునప్పుడు మనల నెవరు
శాంతిపరుతురు? అనేక భయకారణములతోకూడిన యీలోకములో
మనము భీతినొందినపుడు యెవరు మనకు ధైర్యము కలిగింతురు? ఆయ
ననుండి మనల వేరుపరచునది ఐహికగర్వముమాత్రమే అయియున్నది.

ఆయనను మనము విడుచుటవలన మంచికలుగునా? ఆయనలేక

మన సత్కార్యములు స్వార్థపరత్వముయొక్క ఫలమై యుండును మ
రియు మనసౌఖ్యములు కృతఘ్నతను కనుపరచును ఈ ధర్మోపదేశము
ను ఆలకించుటకు వచ్చినవారు దానిని వినిమాత్రము వెళ్ళినచో యిచ్చ
టికి వ్యర్థముగా వచ్చియుందురు. గృహమునకు తిరిగి వెళ్ళినమీదట
వారు భగవంతుని మరచినచో యిది వారికి యేమి ప్రయోజనము? ఇ
క్కడకు వచ్చుటవలన వారి హృదయములు పునర్జన్మస్థితిని పొందకుండిన
పరమేశ్వరునియందుగల వారి ప్రీతి ప్రకాశించకుండిన మరియు ఐహిక
విషయములయందు ప్రవర్తించుచున్నప్పుడు నారాయణుని జ్ఞాపకముంచు
కొనకుండిన వారిక్కడకు వచ్చుటవలన ప్రయోజనమేమి? కలసి భగవ
త్కీర్తనలను పాడుటకును ధర్మోపదేశముల వినుటకును మాత్రమే వా
రిక్కడకు వచ్చినారా? భగవంతునితో యెక్కువ దృఢమైన సంబంధము
ను యేర్పరచుకొనుటకు వారిక్కడకు వచ్చియుండలేదా? సౌభాగ్యస్థితి
యందు ఆయన కరుణను జ్ఞాపకముంచుకొనకుండిన ఆహారపానీయంబు
లవలన పోషింపబడునప్పుడు దాని దాతను గుర్తింపకుండిన వారేమి
చేసిరి? పరిశుద్ధతయొక్క తరగని ఆశయమును విడచి నీవెచ్చట పరిశుద్ధ
త పొందగలవు? నీతికి పూర్ణాశ్రయుడైన ఆయనను విడిచి నీయంతట
నీవెట్లు నీతిమంతుడవుగా నటింపగలవు. సమస్త సుగుణములకును అర్హు
డైన ఆయనను విడిచి నీవెట్లు మంచివాడుగానుండుటకు అర్హుడవై
యుందువు? నీయంతటనీవు యీదినమునుండియే ఆయనకు దాసుడవు
కమ్ము. ఈదినముననే నూతనజీవమును పొందుదువు.

దేవుడెట్లు పూజింపబడవలెనో ఆ మార్గమునుగూర్చి యేమై

ఈ సలహా యవసరమైయుండునా? జీవమును, భాగ్యమును, జ్ఞానమును
బుద్ధిని ప్రసాదించిన ఆయనకు కృతజ్ఞులమైయుండుటకు బోధ యవసరమా?
మనజన్మయొక్క మొదటిదినమునుండియు ఎవని కరుణను మనము అను
భవించుచున్నామో ఎవనియొక్క రక్షణమువలన మనమెల్లకాలము
ను జీవింపగలమో అట్టి ఆయనయొక్క పూజ బోధింపబడవలెనా? పా
పమువలన బాధనొందునపుడు నీవాయన శరణము జొచ్చుటవలన నీవు
నన్నువందలి అపరిశుద్ధతను తొలగించుకొనుటకు నీవు ప్రయత్నము చే
యువా? గురువులకు గురువును తండ్రులకు తండ్రియునైన ఆయనను
నీవు ప్రార్థించవా? ఆత్మాభివృద్ధికై ఆయనను నీవు ప్రార్థించవా?
ఒకని స్వభావము చెడిపోయిన గాని ఆయనను పూజించుటకే
అయిష్టమును వుండను నీ యాత్మను దాని నైజస్థితికి తీసికొ
నిరమ్ము. ఈరాత్రినుండియే ఆయనను పూజించుటకు ప్రారంభింపుము.
వినుటలో మాత్రము ప్రయోజనమేమియు లేదు ఆయనయందు మనము
శరణుజొరకుండిన మనదేశముయొక్క క్షేమమెచ్చటనున్నది పరమేశ్వ
రుడు పూజింపబడని దేశమును ఆయనపరిశుద్ధనామము మెచ్చటింపబడని
కుటుంబమును, ఆయన అధిష్టించనిహృదయమును యెడారులైయున్నవి
అవి విశేషమైన దుఃఖముయొక్కయు బాధయొక్కయు నివాసస్థల
ములైయున్నవి ఈదినమునుండియే ఆయనను నీశరణముగా నేర్పరచు
కొని పూజింపుము. ఆయననుగూర్చి వినుటకు నీకవకాశములేకపో
లేదు- నీజ్ఞాన సహాయమువలన ఆయననుగూర్చి విశేషముగా తెలిసి
కొనియుంటివి అటుమీద జ్ఞానమునకు క్రియను, విశ్వాసమునకు అను
భవమును యేలచేర్చకూర్పవు? ఈదినమునుండియే ఆయనను పూజించు.

టకు ప్రారంభింపుము. మరియు నీకార్యముయొక్క ఫలితమును తక్షణమే పొందగలవు. ఆయనకరుణవలన జీవితముయొక్క సమస్తసౌఖ్యములను అనుభవించుచున్నావు కృతజ్ఞతతో ఆయనను వందింపుము. భయాపాయములయొక్క కాలములలో ఆయనను నీ రక్షణస్థానముగా చేసికొనుము; తల్లితొడమీదనున్న బిడ్డవలె నీవు అంత నిర్భయుడవైయుండుము నీవు పాపమువలన బాధింపబడినప్పుడు పశ్చాత్తాప పడుము; మరియు కన్నీళ్లతో ఆయన శరణుజొచ్చుము. తన శరణుజొచ్చిన వారిని ఆయన ప్రేమించును; మరియు ఆయన పాపమునుండి నిన్ను రక్షించును. ఈసృష్టికి ప్రభువును, రాజులకురాజును, దైవములకు దైవమును అయిన ఆయనను పూజింపుము దీనినంతయు యెఱిగి ఆయనను పూజించుటకు యిచ్ఛగింపని వారిని తమ స్వభావమును పరిశుద్ధ పఱచుకొననిమ్ము; పూర్ణహృదయముతో వారు దేవుని ప్రార్థింపనిమ్ము వారంతట వారిని ఆత్మాభివృద్ధికై ప్రయత్నపడనిమ్ము; అప్పుడు నారాయణునికరుణను నిశ్చయముగా ననుభవింతురు. "ప్రభువునన్ను విడువలేదు, నేనాయనను విడువకుందునుగాక" యనెడు వాక్యముయొక్క అభిప్రాయమును వారు స్పష్టముగా గ్రహింతురు.



## 2 వ ధర్మోపదేశము.

"ఆనన్దరూప మమృతం యద్విభాతి"

అది ఆనంద స్వరూపముగను శాశ్వతత్వముగను ప్రకాశించుచున్నది.

అట్టి అద్వితీయునియందు గౌరవమును భక్తిని కలిగిన జ్ఞానులు, యిహలోకమునందును పరలోకమునందును ఆకసమునందును అంతరాళమునకు సూర్యోదయసూర్యాస్తమయములందును అంతటను ఆనందమును శాశ్వతత్వమును తన స్వరూపముగాగల ఆపరమేశ్వరుని దర్శించెదరు తెల్లవారినపుడు సూర్యుడుదయించి జీవకోటిని నిద్రనుండి మేల్కొలిపినప్పుడును, పదార్థములరూపములను కనుపఱుచునప్పుడును, వారు అంతటను ప్రకాశించెడి అస్తోత్రాహ్యుడయిన పురుషుని ఆప్రకాశించెడు జ్యోతియందు దర్శించెదరు. ఉదయము సమీపించుటతోడనే ఆయనతేజము మన హృదయాకాశములయందు వ్యాపించును సూర్యునకు ఆత్మయు, మన ఆత్మలకు ఆత్మయు, సమస్తవస్తువులకును అంతరాత్మయునైన ఆయన. చీకటినుండి విడబడినప్పుడు ప్రపంచము మనకు గోచరించుటతోడ, తనంతట తాను గోచరించును బాలసూర్యుని ప్రకాశమునందు జ్యోతులకు జ్యోతియైన ఆ తేజమును మనము దర్శింతుము. ఉదయకాలమందలి సౌందర్యమునందు సౌందర్యమునకు సౌందర్యమైన ఆయన మనయెదుటకనుపడును మన కనులు తెఱచిన తక్షణమే ఆయన మనలను జూచుచున్నట్లు మనము కనుగొందుము అంతటను ఆయన మహిమ అయియున్నది మనము ఆయనకొరకు ఆశగలవా

శక్తమైన నిశ్చలమైన హృదయముతో మనము ఆయనను ప్రార్థించిన
లేక మనఆకలి దపనలు తీరకుండిన సమస్తప్రదేశములందును, లోపల
ను వెలుపలను, దూరమునను దగ్గరను; మనము ఆయనను చూడగ
లము. మన మకార్యకరణమునకై ప్రయత్నించుచుండిన మన ఆత్మలను
జీవచ్ఛవములుగను నుత్సాహహీనములుగను మనముచేసిన ప్రభువుప్ర
వేశించుటకు మన మానసికద్వారములను తెఱచియుంచకుండిన మన
ము మెచ్చుటకై వెళ్ళినప్పటికిని నిర్మానుష్యమయిన అటవికయినను జన
సమ్మర్ధముగల పట్టణమునకైనను యాత్రాస్థానమునకైనను పూ
జించెడి దేవాలయమునకయినను మఱియెంకెచ్చటికి వెళ్లినను మనమా
యనను చూడజాలము మనలను మనము పరిశుద్ధపరుచుకొనినప్పుడు
ను, ప్రభువునకు మన హృదయగహ్వరములను తెఱచియుంచునప్పుడు
ను, మనమత్యాతురతతో ఆయనను వెదకినప్పుడును యెల్లప్రదేశముల
ను, పర్వతగుహాలయమునను, వనములోను, అరణ్యమందును, యేకాం
తమునందును సమ్మర్ధముగల ప్రదేశములయందును ఆయన ఆవిర్భ
వించినట్లు అప్పుడుమనము చూచెదము. అంతట మనము సూర్యుని భ
గవంతుడెక్కడనని యడుగుదుము సూర్యుడు మనకాయనను చూ
పింపను. అవనిలోని యేకాంతముగానున్న వృక్షమును దేవు డెక్కడ
నని యడుగుదుము దానినుండికూడా మనకు ప్రత్యుత్తరము వచ్చును
అప్పుడు మనము "నసమేవాధస్తాత్ స ఉపరిష్టాత్ స పశ్చాత్ స పుర
స్తాత్ స దక్షిణతః స ఉత్తరతః" యని యెఱుంగుచున్నాము ఆయనపై
నున్నాడు ఆయన వెనుకనున్నాడు ఆయనముందున్నాడు ఆయనకుడిపై

పునవున్నాడు ఆయన యెడమ ప్రక్కను వున్నాడు అనెడి వాక్యార్థమును మ
నముగ మనింతుము భూమియందును ఆకాశమునందును ఆయన మహిమ నిం
డియున్నది ఆయన తనంతట తాను అంతటను ఆనంద స్వరూపముగను
శాశ్వతత్వముగను ఆవిర్భవించును. మనకఠినహృదయాదుల మార్గముల
ను మనము మూసియుంచుదుము గనుక జ్యోతులకు జ్యోతియైన ఆ
యనను మనము చూడజాలము. సూర్యుడుదయించునప్పుడు ఆయన అ
క్కడ వున్నాడు. అస్తమయ మహిమయందుకూడా ఆయనవున్నాడు
ఉదయమందువలెనె సాయంసమయమందును ఆయన కరుణాస్వరూప
ము కనుబడుచున్నది రాత్రి చీకటిలోకమును నెమ్మదిని విశ్రాంతినిపొం
దించునప్పుడును నక్షత్రగణములో చంద్రుడుదయించి స్వచ్ఛకాంతిని ప
ఱపునప్పుడును నిద్రించెడి లోకమునకు రక్షకభటులవలె నక్షత్రములు
కనుపడునప్పుడును అవిమనకు యెవనిగూర్చి తెలియజేయుచున్నట్లు కను
గొందుము? "యశ్చంద్రతారకే తిష్ఠన్ చంద్రతారకాద న్తరోయం
చంద్రతారకః నవేదయస్య చంద్రతారకశరీరం యశ్చంద్రతారక మ
న్తరోయ మయతి" యెవడు చంద్రనక్షత్రములయందు నివసించునో
యెవాడు చంద్రనక్షత్రములయొక్క అంతర్జీవములయందు నివసించునో
యెవనిని చంద్రనక్షత్రములు యెరుగవో యెవనియొక్క దేహమే యీచం
ద్రనక్షత్రములైయున్నదో అట్టివానిని తెలుపుచున్నట్లు కనుగొందుము.

ఆనందమును శాశ్వతత్వమును స్వరూపముగాగల ఆయనవుద
యించుటలో నున్నాము. ఆనందమును శాశ్వతత్వమును స్వరూపము
గాగల ఆయన అస్తమయములో నున్నాము ఆనందమును శాశ్వతత్వ

మును స్వరూపముగాగల ఆయన రాత్రిలోనున్నాడు. ఈవిషయములో మాత్రమే ఆయనవున్నాడా? ఆసచ్చిదానందస్వరూపుని యొక్క విభవమును వుదయాస్తమయముల సౌందర్యమునందును, చంద్రనక్షత్రములయొక్క వైభవమునందును మనము చూచినయెడల అంతట మానవముఖ సౌందర్యమునందు ఆయనయొక్కవ స్పష్టముగా కనుపడుటలేదా? ఇచ్చట ఆయన ఆస్తికతను చూడకుండిన నీవు దానిని మరెక్కడ చూతువు? మరణరూపమైననిర్జీవపదార్థములయందు మాత్రమే ఆయనను నీవు దర్శింతువా? ఆయనరూపము చతుష్పాత్తులయందు మాత్రమే కనుపడునా? ఆయన ప్రభావమును దైవప్రేమచే ప్రకాశించెడి పరిశుద్ధుల ముఖవర్చస్సునందు చూడవా? పరమేశ్వరుని ఆస్తికతను ప్రభావమును ఉత్సాహజనకమయిన పరిశుద్ధభక్తుని ఆకారమునందు సర్వమునకంటె నధికముగా ప్రేమించుదానికై ఆనందబాష్పముల విడుచునప్పుడు నీవు గమనింపవా? ఇంకనెచ్చటను యింతయధికముగా ఆయన తనను తెలుపుకొనుచుండలేదు. ఉన్నతపర్వతమునందుగాని మహాసముద్రమునందుగాని నక్షత్రమండలములోగాని సూర్యునియందుగానిలేదు. ఆసత్పురుషుల బాహ్యప్రవర్తనము యెంత అత్యున్నతమైనదిగానున్నది! వారిమతాచరణమెంత దృఢమయినదిగా నున్నది! వారిహృదయములెంత కోమలముగను పరిశుద్ధముగనువున్నవి! ఆశాశ్వతునిప్రియవాసస్థానమయిన పరిశుద్ధుని హృదయమెంత శాంతముగను నిర్మలముగనువున్నది! అచ్చట ఆయన స్వరూపమెంత స్పష్టముగా గోచరించుచున్నది! ఆకసమునందుగాని భూమియందగాని, సముద్రములోగా

యింకా మనకెప్పటికిని జేర్చుకొన్న తెలుసుకొనుచుండలేదు భగవద్భక్తులను సత్పురుషుల ముఖసౌందర్యమునందు భగవంతుడు ఆనంద స్వరూపుడుగను శాశ్వత స్వరూపుడుగను కనుపడుచున్నాడు అటువంటి సత్పురుషులు ఆయనను ఉపాసించుటకు చేరునట్టి అట్టి పరిశుద్ధస్థలముయిదే ఇచ్చట ప్రభువు ప్రత్యేకముగా ఆనందస్వరూపుడుగను శాశ్వత స్వరూపుడుగను ఆవిర్భవించును ఈపరిశుద్ధబ్రహ్మసమాజమునందు మన ప్రియతమమయిన దేవుడు ముఖ్యముగా నిండియున్నాడు. ఈస్థలమునందలి వెలుతురులో ఆయన పరిశుద్ధకాంతి వెలుగుచున్నది అంతకంటె యెక్కువ ప్రకాశమానముగను ప్రియకరముగను యిచ్చట ప్రతివానిహృదయమందును ఆయన ఆవిర్భవించియున్నాడు ఇచ్చటనుండగా ఆయన ఆస్తికతను యెక్కువస్పష్టముగా యీదినమున భావించుచున్నాము ఆయన అనుగ్రహమును యెక్కువపూర్ణముగా అనుభవించుచున్నాము, సులభముగా పొందజాలని యీమానవజన్మమునకు అనిర్వచనీయమయిన ధన్యతను గలిగించుటకు ఆయన పరిశుద్ధ పాదములయందు మనవిశ్వమయిన నిశ్చలభక్తియనెడి పుష్పమును మనమందర మర్పింతము గాక.



## 3 వ ధర్మోపదేశము.

"తమాత్మస్థం యేనుపశ్యన్తి ధీరాః తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషాం" విజ్ఞానులు పరమేశ్వరుని తమ ఆత్మలయందు దర్శించెదరో వారలకు శాశ్వతమయిన శాంతి యితరులకు లేదు.

మన అంతర్యామునందున్నట్టియు ప్రియతమమయినట్టియు పరమేశ్వరుడు మననుండియు మనము ఆయననుండియు యెన్నడయినను వేరైయుండవలయునని యెప్పుడయినను కోరతగినదా? ఆయన మనకు జీవము జ్ఞానప్రసాది ఉత్తమమయిన రక్షకుడు ఆయనదయను మనము విరామము లేకుండ అనుభవించుచున్నాము అంతట దేవుడు వానినుండియు వాడు దేవునినుండియు వేరైయుండవలయుననెడి కోరికను యెవడయినను కలిగియుండుట సాధ్యమగునా; అట్టిప్రార్థన నిజమయిన మానవుని హృదయమునుండి యెప్పుడయినను బయలువెడలునా? మనుష్యుడు పాపమువలన చెడియుండవచ్చును; కాని భగవంతుడు తననుండియు తాను భగవంతునినుండియు వేరైయుండవలయునని కోరునంత హైన్యతను వానియాత్మ యెప్పుడయినను పొందునా? భగవంతుని కొరకు వుండెడిఆశ తనకు యెల్లప్పటికిని లేకుండునటుల మానవుడెప్పుడయినను అంత అధోగతిని చెందునా? ఆయన భీకరస్వరూపమును చూచినవాడు భయంకరమయిన వురుములను పిడుగులను సృజించుటను ఆలోచించునప్పుడు భయపడి ఒకకాలమందు దేవుడు తననుండియు తా

ను దేవునినుండియు వేరైయుండవలయుననవచ్చును కాని తన ఆత్మలో "నీవిచ్చటికి పారిపోగలవు; ఆయనరక్షణము లేక మరెంకెవనినుండి మోక్షమును పొందగలవు యెవనిని నీవు శరణముకోరగలవు? అనెడి ఘనమయిన వాక్యము వినబడుటను వాడెప్పుడును గమనింపడా? పాపమువలన భీతి నొందినప్పటికిని ఆయన యందు శరణుజొచ్చుము; ఆయనవలన మోక్షమును పొందుటకు యిచ్చగింపుము, ఆయనసన్నిధియందు దుఃఖింపుము. పాపముగల హృదయముతో సహితము అయననుండి వేరైయుండజాలడు కొండ గుహలలో నయినను, అడవియందయినను, సముద్రములోనయినను, పాపి దాచ్చుటనుండినప్పటికి దేవుని రాజ్యమునుండి వాడు పారిపోజాలడు, ఆయనయందు శరణుజొచ్చిననే తప్ప తన హృదయమందలి భీతినుండి విడబడజాలడు. కావున, నీవుపాపము చేసినప్పటికి ఆయననుండి పారిపోవద్దు ఆశతోడను అనుతాపముతోడను నిండినహృదయముతో ఆయనయొద్దకు వెళ్ళి ప్రార్థింపుము; నిన్ను నీవు అధోగతిని పొందించుకొంటివని ఆయనతో చెప్పుము; నిన్ను చేర్చుకొనుటకు ఆయనను అడుగుము నీహృదయము అంధకారములో మునిగియున్నదని ఆయనతో చెప్పుము జ్యోతులకు జ్యోతియైన ఆయనను నిన్ను అంధకారమునుండి తేజఃప్రదేశములోనికి తీసికొనివచ్చుటకు అడుగుము అగమ్యమయిన పాపమునుండి నిన్ను ఆయన తప్పించుటకు మాత్రమే ఆయనవలన వెయ్యిశిక్షలను పొందుటకు సిద్ధముగను యిష్టముగను వున్నాననియు ఆయన అనుగ్రహముతో కూడిన ముఖము తనకు చూపబడవలెననియు ఆయనతో చెప్పుము అంత అనుతాపము,

తోడను అశక్తతోడను కూడిన హృదయముతో ఆయన దయకొరకు నీవు ప్రార్థించిన యెడల నిశ్చయముగా ఆయన కరుణాదృష్టి నీమీద వహించును నీపాపకు లోపహృదయము నిశ్చయముగా శాంతిని పొందింపబడును. పాపము చేయువారును, అదేనమయమున దేవునియందు శరణమునకై వెదుకకుండువారును, దేవుడు లేకుండిన పరలోకము లేకుండిన బాగుగనుండునని భ్రమింపవచ్చును; అట్లే అనమ్మకమును కలిగించుకొనుటకు వారు తప్పుసిద్ధాంతముల నేర్పరతురు. అట్టి ఆత్మహంతకులుమాత్రమే భగవంతుడు తమనుండియు తాము భగవంతునినుండియు వేరైయుండవలయునని యిచ్ఛగింతురు భీతితోడను పాపముతోడను పూరింపబడినవారయి వారిహృదయములయందు యెటువంటి వ్యర్థ సందేహములను కలిగియుందురు. అయ్యో! వారిహీనత్వమునకు! ఓవ్యర్థజన్ములారా! వారిహృదయము భగవంతుడు లేడని నమ్ముటకు యెట్లును సిద్ధపడియుండలేదు; అయితే వారు అంధులయ్యేయుందురు ధర్మమునకును అధర్మమునకును సాక్షిభూతుడయిన పరమేశ్వరుడు జీవముగలదేవుడైయున్నాడు; అయితే యీయాయుధాధర్మమును గమనించుటకు వారు జాగరూకులై యుండలేదు వారిహృదయములలో భయము పుట్టుచున్నది. అయితే పాపములను శిక్షించుటాకికివారు భయపడుటలేదు మనతండ్రియైన దేవుడు తనశరణమును పొందుటకు పిలుచుచున్నాడు అయితే అయనపిలుపును వారు వినుటలేదు ఆయన శిక్షలయొక్క భయమువలన నీవు మరలుదువా? లేదు, యెప్పుడును అట్లు చేయవద్దు ఆయనశిక్షయొక్కటియే తగిన ఔషధమైయున్నది. ఇప్పు

టినుండియు ఆయనశరణుజొచ్చినను; సమస్తబాధలనుండియు సమస్త భయములనుండియు నీవు విముక్తిజెందుదువు నీయాత్మ తిరిగి ధర్మమా నెడు కిరణములచే ప్రకాశించుచుండును; నీమనస్సు భగవత్కథలకై ఆకర్షించబడును; నీవు ఆపరిశుద్ధ ఆత్మయొక్క సహవాసమునకు తగి యుందువు. మరణము నిన్ను సమీపించుచున్నప్పుడు ఆ ఆసన్నకాల మందు దేవుడు నీయెదుట నిలచినప్పుడు మీహృదయములలో యేమి భావించుకొందురు ఒకడు దుష్టమార్గములలో దేవునినుండి వేరై కొంతకాలమువరకు తిరుగుచుంటిననియు, అంతట తనకు మోక్షము లభించు ఆశలేదనియు తలంచును. అయితే దేవుడు తనకరుణను చూపించెను ఆయన అనుగ్రహమువలన దేవునివైపు వాడుతిరిగెను లేనియెడల వాడెంత వ్యర్థుడై యుండెడివాడు. తిరిగి మరియొకడు నాగతి ఇప్పుడు యేమగును? ఈదుఃఖముయొక్కయు బాధయొక్కయు భారమును నేను వహించజాలను నే నెచ్చటకు వెళ్ళుచుంటిని నేనేమైపోదును? అయ్యో! నాఆత్మనుగూర్చి నేను ఆలోచించలేదు నాకిష్టముండిన ధర్మమార్గమందే నే నెన్నిపర్యాయములు ప్రవేశించవలసి యుండెను; అయితే నేను వాటిని నిరాకరించితిని, యెంతెంతయుగా దేవుడు నన్ను హెచ్చరించెను అయితే నేను వాటిని లక్ష్యపెట్టలేదు నాగతియిప్పుడేమగును? మరణకాలము దూరముగానున్నదని భ్రమపడవద్దు లేదు, దానికి పూచియేమియు లేదు. ఇప్పుడు నీవు విషయసుఖములను ఆనందింపవచ్చుననియు వృద్ధాప్యములో మతమును ఆచరింపవచ్చుననియు, ఆకాలములో భగవంతుని సేవ చేయవచ్చుననియు, ఆలోచించ

వద్దు. లేక ఈదినమున చేయగలిగినదేదియు రేపటికి యెప్పుడును వుంచవద్దు పాపము మనము అవకాశములను యిచ్చినప్పుడు బలపడును, ఏశోధనలయినను నీవిప్పుడు జయించగలిగినయెడల యే దుష్టేచ్ఛనయినను నీవిప్పుడు వారింపగలిగినయెడల ప్రస్తుతము దానిని తృప్తిపఱచి తదనంతరము నిగ్రహింతునని తలచవద్దు అట్టివాంఛ వుండుటవలన పాపము నిన్ను విడువలేదనుటను ధృవపరచు చున్నది నీమనస్సు దుష్టతలంపునుండి విడివడలేదని సాక్ష్యమిచ్చుచున్నది ఆపరిశుద్ధతయందు యేమాత్రము అయిష్టముగల మనుజుడయినను దానినుండి విడిబడకుండ తనకు తాను నెమ్మదిని కలిగియుండ గలుగునా తన అపరిశుద్ధతయందు ఒక్క నిమిషమయినను సుఖపడుటకు వానికి సాధ్యమగునా కావున పాపమునుండి విడివడకోరువాడును తనయందలి పరాజయమునొందిన ధర్మము తిరిగి జయమునొందవలయునని యిచ్ఛగించువాడును తక్షణమే దేవునియెదుట ప్రార్థనను మొదలుపెట్టవలయును తాను తాప హృదయముతో ఆయనయెదుట దుఃఖపడనిమ్ము అంతట వానిహృదయము బాధలనుండి తొలగింపబడును పాపము వానియందు ఆకర్షణను పోగొట్టుకొనును పాపబాధ వానికింక నేమాత్రమును వుండదు అంతట దేవుడు తననుండి దూరముగా నుండవలయునని వాడింక నేమాత్రమును కోరడు అంతట వాడు ఒకప్పుడు దేవునికి దూరముగా నుంటిననియు మానవుడు దేవునితో నుంచవలసినంత సమీప బాంధవ్యమును వాడు అప్పుడు వుంచలేదనియు అప్పుడు వాడెంత నిష్ప్రయోజన మయినట్టియు అపరిశుద్ధమయినట్టియు జన్మమును గడుపుచుండెననియు వాడుబలమైన దుఃఖమును కలిగియుండును అయితే ఇప్పుడు దేవుని అనుగ్రహమువల

న వాడు ఆయనను చూచెను దేవుడు తన కరుణయందు తనను తాను వానికి తెలుపుకొనెను అంతట ఇతరు లెన్నటికిని అనుభవింప జాలనట్టి శాశ్వతమయిన శాంతిని తమ ఆత్మలయందు స్వయముగా దర్శించెడి యాబుషులు కలిగియుందురని వాడు తనఅనుభవములో తెలిసికొనును అంతట వాడు దేవునినుండి తాను వేరై యుండిన కాలములో తన స్థితి యెంత నిశ్చయముగా నుండెనో గమనించును అయితే ఇప్పుడు వాడు దేవునివైపు తిరిగినందున ప్రతివస్తువును చంద్రకాంతివలె ప్రకాశించుచున్నది సమస్తమును సౌఖ్యప్రదముగను ఆనందదాయకముగను వున్నది.

ఈ రెండు స్థితులకును యెంత విశేషమయిన భేదముకలదో వాడుచూచుచున్నాడు వాడు దేవునినుండి వేరయియుండినప్పుడు వాడేవిధమయిన సుఖమును అనుభవింపలేదు ఇప్పుడు వాడు తనఆత్మయందు దేవుని దర్శించుచుండెడి గావున కష్టములవలన బాధింపబడుటలేదు వెయ్యిమంది శత్రువులు బయటనుండి వానిని బాధింపవచ్చును అయితేయెవరును వాని ఆత్మశాంతిని హరింపజాలరు యేలనన తన ఆత్మయొక్క ఆనందతమమైన పరమేశ్వరుని యందు వాడు శరణముపొందియున్నాడు వానికి దుఃఖముయొక్క బాధలేదు మరణభయములేదు పాపబాధలు వానిని వశపరచజాలవు వాడు దుఃఖమునుండి విడిపడుచున్నాడు పాపమునుండి తొలగింపబడి సువహ్యాదమానుషు అజ్ఞానిక్లిష్టమైన యూనీక బంధములనుండి విముక్తుడై వాడు శాశ్వతుడగుచున్నాడు మనకు ఒక్కడే రక్షకుడును సమస్తజీవులును అనేకత్వమువలన పలువిధ సృష్టిరచనలాయెను సైన పరమేశ్వరుని తమఆత్మలయందు ప్రత్యక్షముగా దర్శించెడి యాజ్ఞానులుమాత్రమే యితరులెవ్వరును పొందజాలని శా

శ్వతానందమును యనుభవింతురు ఎవడుమాత్రము అచంచలుడో సమస్తజీవులకును యెవ్వడు ఒక్కడేయైన ప్రాణదాతయో యెల్లకోర్కెలను తీర్చువాడెవ్వడో అట్టిపరమాత్మను తమఆత్మలయందు ప్రత్యక్షముగాదర్శించు జ్ఞానులుమాత్రమే ఇతరులు భాగించుకొనజాలని శాశ్వతమయినశాంతిని యనుభవింతురు "తమఆత్మలయందు ప్రత్యక్షముగా దేవుని దర్శించువారు" యనువాక్యము బలముగా చెప్పబడెను మన యెదుటనుండెడి ప్రకాశముయొక్క కిరణములయందలి దేవునిమహిమ ఒకవిధముగా మనకు దూరమయినది అయియున్నది మన ఆత్మయందు ఆయనను దర్శించినపుడు మాత్రమె ఆయనను సమీపముగ చూచుచున్నాము యీపు జాగృహమందు ఆయన ఆస్తిక్యమును చూచుచున్నాము అయితే ఆయన మనయెదుట యింతకంటెను సమీపమునందున్నాడు మన ఆత్మల మధ్యమున ఆయన నివసించుచున్నాడు మనదేహమే దేవాలయముగాగల ఆయనే సర్వస్వతంత్రుడగు దేవుడు బాహ్యమున ఆయన స్వరూపమును సందర్శించుట ఆయనను దూరమునుండిచూచుటమాత్రమే అయివున్నది ఆయనను మన హృదయములందు చూచునప్పుడుమాత్రమే ఆయనను సమీపముగా చూచుచున్నాము దేవాలయమువంటి యీదేహమునకు ఆయనే దేవుడు ఆయన మన స్వంత సొత్తు అయివున్నాడు గాలి వర్షము, అగ్ని, సూర్యుడు యెల్లరకును సామాన్యప్రయోజనమునకు వలెనే ఆయన సర్వులకును సాధారణసొత్తుమాత్రమేగాక మనలోని ప్రతివానియొక్కయు ప్రత్యేకపుసొత్తు అయివున్నాడు ప్రతిఆత్మయు ఆయనతో ప్రత్యేకసంబంధమును గలిగియున్నది ఆయన ప్రతివానియొక్కయు ప్రభువైయున్నాడు ఆయన ప్రతివానియొక్కయు కులదేవతయైయున్నా

డు నాతండ్రి, నాతల్లి, నాసోదరుడు, నాసోదరి వీరందరు నావారు అని నేను పిలచులాగున దేవుడు నాదేవుడై యున్నాడు ఆయనహృదయము నకు ప్రభువై యున్నాడు "యాఉదరమంతరంకృతే అథాతస్యాభయాం భవతి" ఆయనను కొంచెము దూరములో చూచువాడుసహితము భయ మునుండి విడిపింపబడడు అయితే మనము ఆయనను మనఆత్మలయం దు దర్శించునప్పుడు ఆయన సమ్ముఖమునందు సమస్త భయమునుండియు మనము తొలగింప బడుదుము ఆశ్చర్యము ఆయన స్వరూపమును బా హ్యాంతరములయందెల్లచోటులను మనము చూచుచున్నాము మనకన్ను లెఱచినపుడు మనము ఆయనను మనచుట్టును అంతటనుచూతుము మ నకన్నులు మూసికొనినపుడు మన వరాయన స్వరూపమును మనలో తన ను తాను తెలుసుకొనుచున్నట్లుచూతుము "ఏకమేవాద్వితీయంబ్రహ్మ" రెండుగాక ఒకటేయైనది బ్రహ్మము.



## 4 వ ధర్మోపదేశము.

"హిరణ్మయే పరేకోశేవిరజం బ్రహ్మనిష్కళం"

పరమేశ్వరుడు ఆత్మయనెడు శ్రేష్టమయిన హేమపంజరమునందు నివసించును

మనదేహమే పట్టణముగాగలిగిన, ఆదేవుడే ప్రభువని మనమిప్పు డు వినియుంటిమి ఆయన మనలో ప్రతివానియొక్కయు కులదైవమని

యు, మన యాత్మల కాయన యంతరాత్మయనియు, ఎవరాయనను తమ యాత్మలయందు దర్శించెదరో వారుమాత్రమె ఆయనను నిశ్చయముగా చూచుచున్నారనియు ఆయనను తమ హృదయములందు వెదకువారు వారి ప్రయత్నములయందెప్పుడును విఫలమనోరథులు కారనియు మన మింతవరకును వినియుంటిమి అయితే ఎందరెందరో ఇంకను బాహ్యసంతోషములలో మునిగి యనేకులు తమను తాము మఱచిరి యింద్రియములతృప్తికై వారు సమస్తమును ధారపోయుదురు మన మాయనను బాహ్యమున ఎన్నటికిని చూడలేము ఆయన ఆస్తిత్వము ఆకసమంతటను పూర్ణముగ వ్యాపించియున్నది అయితే ఆయనను అక్కడజూచుట ఆయనను కేవలము సమీపముగా చూచుట కాదు సృష్టియంతటిలోను ఆయనప్రతిమలుమాత్రమే కలవు అయితే ఆత్మయందు ఆయన నిజమయిన ఆత్మను మనముచూడగలము సృష్టియొక్క సౌందర్యమునందును, దైవప్రభావమునుగలిగినమానవ ముఖవర్చస్సునందును, నీతిమంతుల సత్ప్రయత్నములయందును ఆయనస్వభావముయొక్క ప్రతిబింబములను మాత్రమే మనము చూచుచున్నాము కాని ఆత్మయందు ఆయన నిజమయిన ఆత్మవసించుచున్నది అచ్చట ఆయన తనంతటతాను సత్యస్వరూపుడుగాను, జ్ఞానస్వరూపుడుగాను, అనంత స్వరూపుడుగాను, తెలుపుకొనుచున్నాడు "సత్యంజ్ఞానమనంతమ్" అచ్చట ఆయన శాంతస్వరూపుడుగను, మంగళస్వరూపుడుగను, రెండుగాక ఒక్కడేయైన దేవుడుగను, చూపించుకొనును "శాంతంశివమద్వైతమ్" ఆయన ప్రతిబింబము లెచ్చటనుకలవు మాతృప్రేమ, సోదరప్రేమ, పతివ్రతయైనభార్యయొక్క

పరిశుద్ధమైనప్రేమ, ఇవి ఆయన ప్రతిబింబములుమాత్రమైయై యున్నది అయితే ఆయన నిజమయిన యాత్మ ఆత్మయందు తెలుపబడును ఆత్మ యనెడి అతిశ్రేష్టమయిన హేమపంజరమునందు ఆయన ప్రత్యక్షముగని వసించుచున్నాడు. అచ్చటఆయనసత్యస్వరూపుడుగను ప్రేమాస్వరూపుడుగను, శాశ్వతస్వరూపుడుగను తెలుపుకొనును; సృష్టిఆయనమాత్రప్రతిబింబమైయున్నది-ఆత్మయందు మనకెనే అంతస్పష్టముగ నెచ్చటను, ఆయనపరిశుద్ధమైనట్టియు, నిరాకారమైనట్టియు, సుందరమైనట్టియు స్వరూపముకనబడదు ఆయనను హృదయమందు వెదకువాడు యెన్నటికినితనప్రయత్నమునందు విఫలమనోరథుడు కాడు అయితే ఆత్మయందు ఆయన స్వరూపము యెట్టిదిగానుండును? అచ్చట ఆయన యేవిధముగ నున్నాడు తానున్నాడని భావించునంత స్పష్టముగ దేవుని తాను చూడలేనని యు తనదేహమందు తానున్నాడని గ్రహించునంతగా ఆయనవునికిని తెలసికొనజాలనని యు నొకడు చెప్పవచ్చును ఏయాత్మ అయితే దేవునివలనకలిగినదో, ఏఆత్మ దేవునికి గేహామైతానుగానున్నదో, ఆఆత్మయందు ఆయనను వాడు జూడలేడు అట్టిజనులు మనమాయనను చూడవలసినవిధమున ఆయనను జూడరు అంతములయిన వస్తువులకు ఆధారమయినది అనంతమయినదొకటియేయని మనజ్ఞానము చూపించును మానవాత్మ ఆదికారణమునుండియు, ఆధారమునుండియు, భేదింపబడజాలదు నాశాధారుడయిన ఆయననుండి సేనెట్లు వేరుగా నుండగలను మనమాచెట్టును శాఖలతోడను, పుష్పములతోడను, ఫలములతోడను చూచుచున్నాము భూమిలో లోతుగా కప్పబడి యున్నప్పటికిని దానికి వేళ్లులేవని మనమనుకొనగలమా? ఇదేవిధమున మనయంతముగల ఆ

త్మ ఆయాధికారము లేక యుండజాలదు నన్ను నేను క్రమముగా తెలిసికొనినప్పుడు నేను పరిమితముకలవాడననియు, యొకరిమీద యాధారముగలవాడననియు, నేను ఆధారముగానున్న యొకగొప్పశక్తి నాకతీతమైయున్నదనియు, నాకు తెలియును నీజ్ఞానమువంక చూడుము అది యెంత స్వల్పమయినదియు హద్దుగలదియు అయివున్నది అయితేఅది కూడా అపరిమితమైనజ్ఞానమును తెలుపుచున్నది. నీయిచ్ఛయొక్క స్వభావంక చూడుము యెంతస్వతంత్రమయినదిగాను అయితే యెంత హద్దుగలదిగాను అది వున్నది అది ఆఘనమైన యిచ్ఛయందు ఆధారముకలదిగా తెలిసికొందువు ఆ అనంతమైన శక్తిని ఆధారముగా గలిగినప్పుడు నీయందు స్వతంత్రముయొక్క చిహ్నములను నీవుకనుగొందువు నీయందలి గౌరవించునట్టియు, భక్తి కనుపరచునట్టియు ప్రేమించునట్టియు శక్తులనువిమర్శింపుము ఆ యనంతమయిన శక్తియందుమాత్రము వుంచబడిననేతప్ప అవి యెన్నటికిని తృప్తిజెందవు అత్యుత్తమమైన దేవాత్మయందు నీయాత్మయంతయు ఆధారముయున్నట్లుగా నీవు భావింపుము. ఆ యాత్మతో దాని యాదికారణమును దాని యాధారమును నీవు కనుగొందువు సమస్తవస్తువులును యవకాశము నాధారముగాగలిగియున్నట్లు సమస్తవస్తువులును సమస్తావకాశమును దేవుని యాధారముగా గలిగియున్నవి బండిఆకులు బండియొక్క చక్రమునకున్ను యిరుసునకున్ను యాధారమయినట్లు అవినాశియైన పరమాత్మయందు మానవాత్మ యాధారమును కలిగియున్నది ఇదేవిధమున సమస్త భూతములును, యెల్లమతములును, అన్నిజంతువులును పరమాత్మయందు వానివునికి యాధారముగాగలవి మానవాత్మయు పరమాత్మయు

వీని రెంటికిని మధ్య అవకాశము లేనంత ఒకదానికొకటి యంతదగ్గరగా నున్నవి మానవాత్మకును పరమాత్మకును గల సంబంధము అంతముఖ్యమైనదైయున్నది ఆధారము కలిగింపబడి ఆధారభూతుని మనము తెలసికొనగూడదా? ఆయనను తన హృదయమందు జూచువాడు సమానాధికాద్వితీయుడయిన పరమేశ్వరుని సమస్తమునకును తనకును ఆధారభూతునిగ చూచును మానవాత్మయు పరమాత్మయు రెండును కలిసియుండును ఆ రెండును యొకదానికొకటి మిత్రులైయున్నవి ఇవియొకటి ఆధేయముగను యొకటి ఆధారముగను, యొకటి సుఖములను యనుభవించునదిగను, యొకటి ఆనందమునిచ్చునదిగను రెండును కలసి యెల్లప్పుడును నివసించుచున్నవి ఆయనతో మనసంబంధమెంత సామాన్యమయినది! భగవంతునితో సంబంధమెట్లు సాధ్యమగునని యెవరయినను అడగవచ్చును మానవుడు మానవునితో సహవాసమును మాత్రమే యనుభవించగలడు అయితే అనాద్యు అవినాశియు శాశ్వతుడునయిన ఆమహానుభావునికిని అల్పజీవులును, అంతకంటె నెక్కువగా యనేక కొరతల వలనను కష్టములవలనను యిబ్బందిపడుచుండెడి మనకును యెంతగొప్ప భేదముండియున్నది అట్టిజనులు భగవంతుని వుత్కృష్ట స్వరూపమును, తమ అల్పత్వమును జూచునప్పుడు భగవంతుని సన్నిధానమునకు పోవుటకు జంకుదురు అయితే సహవాసమన నేమి? కలసియుండుట మాత్రమే దూరముగా వస్తువులతో మనము కలిసి యుండజాలము అయితే మనకతిసమీపమున నుండు వానితో కలసియుండుటకు కష్టమేమి? అంతదగ్గరగానున్న వానితో మనమేల కలసియుండకూడదు? ఆధేయమాధారము నుండి వేరైయుండగలదా? పూర్వకాలమందు ఋషులాయన సహవా

సమునుబొందియుండిరి వారాయనను హస్తమందుండు అమృతఫలమని వర్ణించియుండిరి నేనీవందును నాచేతితో పట్టుకొనగలిగి నట్లాయనను నాయాత్మతో గ్రహింతును మన యాత్మలు స్పర్శవలన నాయన వునికిని గ్రహించునంత దగ్గరగా మన కాయన వున్నాడు అవి యెల్లప్పుడును ఆయన సాన్నిధ్యమున నివసించుచున్నవి మనకాయన యింత దగ్గరగానున్నప్పు డాయనతో మనమేల కలసియుండ గూడదు ఇంతకంటె నేది సహవాసమైయున్నది నిష్కపటములయిన హృదయములతో మన మాయనకు ప్రార్థనల నర్పించుచున్నాము ఆయన వాని నాలకించుచున్నాడు మనకు ఆయన సలహాల నిచ్చుచున్నాడు ఆయన మధురమయినవాక్కులను మనము వినుచున్నాము ఇది ఆయనతో నివసించుట కాదా నేనాయనతో మాట్లాడినపుడెల్ల నాయన వినుచుండును నాకాయన యిచ్చెడు యాజ్ఞలను నేను వినుచుందును ఆయనతో నివసించుటింతకంటె నేమైయుండును నేనాయన సుకరమయిన ముఖమును చూచుచున్నాను నేనాయన వివేకములయిన సలహాలను వినుచున్నాను నా ప్రార్థనల కాయననుండి వుత్తరవుల పొందుచున్నాను ఆయనతో నివసించునంతకంటె నేమైయుండును మన మాయన సహవాసమును పొందలేమని చెప్పెడివారు కొంచె మాలోచించినట్టయిన నాయనతో వలెనె యింకెవనితోడ నట్టిసహవాసములను కలిగియుండజాలమని వారు చూతురు ఆయన సలహాలు మాటలమూలమున నెప్పుడును చెప్పబడవు అయిన వానిని మనము గ్రహింతుము ఆయనతో నివసించుటకు మన బాహ్యేంద్రియముల సహాయమక్కరలేదు మన నేత్రములును శ్రోత్రములును అపుడికి నవసరము లేదు నేత్రశ్రోత్రములు లేక ఆయన సమస్తమ్ము

జూచులాగునను వినులాగునను మనముగూడ నదేప్రకారముగా మననే త్రములతో కాకున్నను మన మాయనను చూచుచున్నాము మనశ్రో త్రములతో గాకున్నను మనమాయన మధురవాక్యముల నాలకించుచు న్నాము మనమాయన నట్లు ప్రత్యక్షముగా దర్శించు నప్పుడును యా యన వాక్యము లాలకించి యాయనను స్పర్శించునప్పుడును మనమాయ నతో కలసి నివసించుచున్నామని చెప్పుటచేతికంటె మన యభిప్రాయ ముల నెట్లు స్పష్టముగా చెప్పగలము ఆయన మధురరసమువలె నున్నా డు మానవు డాయనను బొందినపుడు మాటిపోవును నేత్రములు లేక జ్ఞానసహాయమున మన మాయనను చూచులాగునను స్పర్శేంద్రియ స హాయము లేక మన యాత్మవలన మన మాయనను స్మరించులాగునను మన రసనేంద్రియ సహాయ మక్కఱ లేకనే నశ్వరమైన ఆనందరసమును మనము రుచిచూడవచ్చును మనయాత్మల నాయన యనుపమానమయిన ప్రేమయందును ఆనందమునందును మునిగియున్నవి ఆయననిర్మలానం దము మన యాత్మలయందుద్భవించునపుడు ఆయనను మధురరసమని పి లుచుటచేత సరిపోవును మన యభిప్రాయములను తగినంత వివరముగా వెలిబుచ్చజాలము ఏరసమును దానివంటిది కాదు అది నిరుపమానము ఆయన సహవాసము ననుభవించునపుడు మన యింద్రియ సహాయ మ క్కఱ లేదు ఆయన మన యింద్రియ గ్రహణమున కతీతుడయియున్నా డు అట్టి యాయన సహవాసము ననుభవించుటకూడ నైయున్నదిమా నవాత్మ యాయనను స్పర్శించునప్పుడును ఆయన కరుణా ముఖమును చూచునప్పుడును ఆయన యాజ్ఞలను వినునప్పుడును ఆయన శాశ్వతత్వ మనెడి రసమును గ్రోలునప్పుడును నేత్రములయొక్కయు శ్రోత్రముల

యొక్కయు యితరేంద్రియములయొక్కయు సహాయము మక్కరలేదు ఆ
యనకును మనకునుగల సంబంధ మెంతసమీపముగా నున్నదో యాయ
నకును మన యాత్మకును మధ్య [illegible]
యేలనన రెండును స్థలాతీతములయి యున్నవి మన యాత్మ [illegible]
డును యాయనతో కలిసి యున్నది ఆయన ప్రతిబింబములు [illegible]
తటను యెట్లున్నవో యాలోచించుట నిశ్చయముగా [illegible]
ప్తియై యున్నవి ఆయన యానందస్వరూపముయొక్క చిహ్నములు [illegible]
యందలి సౌందర్యమునందును మానవుల సత్ప్రవర్తనమునందును [illegible]
ప్రేమయందును యెట్లున్నవో కనుగొనుట ఘనమయిన తృప్తిగా యు
న్నది అయితే మన హృదయములయందాయనను దర్శించుట యనగా
ప్ప స్వాతంత్రియమయి యున్నది ఆయన ప్రతిబింబములను బాహ్యము
న జూచుచున్నాము అయితే ఆయన నిజమయినయాత్మ మన హృద
యములయందున్నది మన మాయన నక్కడ చూచునప్పు డాయన న
చ్చట మాధుర రసమే యైనట్లును ఆనందకారణుడయినట్లును భావింతు
ము ఆరసముయొక్క సారమును మనము గ్రహించునప్పుడు మన మెం
త సంతోషము గలిగియుందుము మన మిచ్చట నేమేమి యనుభవించు
చున్నామొ వాని నాయన దయవల్ల పొందుచున్నాము వాయుప్రవ
ర్తనమును సూర్యుడును చంద్రుడును ఆయన గొప్పదానములు [illegible]
బంచిపెట్టుచున్నారు అయితే ఆయన మనయాత్మలయందు [illegible]
నునప్పుడు మరింకేవస్తువునందును కనుపరచబడినంత [illegible]
యాయన చూపించుచున్నాడు ఆయన శుభకరమగు [illegible]
[illegible] తెలుపుచున్నాడు మన కాయన ప్రేమను పొందించుచున్నా[illegible]

న ధర్మమార్గములందు మనల నిలుపుచున్నాడు దీనియందు యాయ నకును మనకునుగల ముఖ్యసంబంధ ముండి యున్నది ఆయన మనకిచ్చి డి యన్నివరముల లోపలను యిది శ్రేష్టమయినది ఆయన మనలను శా శ్వతత్వమునకు వారసులుగాచేసినను నదే మన ఉత్తమమయిన స్వాతం త్రియమయి యున్నది ఆశ్చర్యము ఇచ్చుటనహితము యాయనయే మ నఘనమయిన యభివృద్ధియనియు మన యొక్కటియైన మార్గమనియు మన వుత్తముడయిన స్నేహితుడనియు మన శ్రేష్టమయిన యానందమ నియు మన మెరుగుదుము



## 5 వ ధర్మోపదేశము

"నచక్షుషా గృహ్యతేనాపి వాచానాన్యైర్దేవైస్తపసా కర్మ ణావా। జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్వ స్తతస్తుతః పస్యతే నిష్కళం ధ్యాయ మానః॥ పరమేశ్వరుడు నేత్రములచేంగాని వాక్కుచేత గాని యితరేం ద్రియముల వలనగాని తపస్సుచేతగాని కర్మచేతగాని గ్రహింపబడనేర డు అయితే నిర్వికారమయిన ధ్యానమూలమున మనశ్శుద్ధికలవాడు ఆ యన ప్రసాదించిన జ్ఞానమువలన తెలసికొననగును

మన యాత్మకును పరమాత్మకును గల సంబంధ మెట్టిదో మన మాయన సహవాసము నెట్లనుభవింపగలమో మనమిదివరకు వినియుం

టిమి ఆయన మన బాహ్యేంద్రియములకు గోచరింపకున్నను ఆయనమ
న యాత్మలయందు తెలుపుకొనునట్లు జ్ఞానస్వరూపముగనే చూచున్నా
మనియు ఆయన మన శ్రోత్రేంద్రియములకు గోచర్యము కాకున్నను
ఆయన యాజ్ఞలను సలహాలను వినుచున్నా మనియు ఆయన సర్వేంద్రి
య గ్రహణమున కతీతుడయినను ఆయనసత్యజ్ఞానానంద స్వరూపమును
మనము గ్రహింపగలమనియు శాశ్వతత్వమునను ఆనందస్వరూపముగను
అవతరించి యాయన మధురరసమును త్రాగుటవలన మనముతృప్తినొం
దుదుమనియు మఱియు ఆయన బాహ్యేంద్రియములచే గ్రహింపబడకు
న్నను ఆయనకును మనయాత్మలకును సన్నిహిత సంబంధముగలదనియు
మనమింతవరకును తెలిసికొనియుంటిమి మనము ధ్యానమందు నిర్వికల్పు
లమై అట్లు మనలను పరిశుద్ధపరచుకొనినప్పుడు మన ఆత్మలయందాయ
నను ప్రత్యక్షముగాజూతుము ఆ మహోన్నతపురుషుని సహవాసము
ను మనము అనుభవించునప్పుడు మన యల్పజీవములు ధన్యతను పొం
దింపబడును ఆయన జ్ఞాననేత్రము మనమీదను మన నేత్రము వీశాదను
ప్రసరించుటను మనము చూచునప్పుడు మనకును ఆయనకును సహవా
స ముండియున్నది ఆయన నొక్కసారి గ్రహించుటకు ప్రయత్నింపుము
జ్ఞానదృష్టివలన నీయాత్మను వున్నతస్థితికి తీసికొనిరమ్ము అంతట నీవు
భగవంతుని చూపును గమనింపగలవు. ఆయనచూపు ప్రియమైన దృ
ష్టియై యున్నది ఆయన స్వభావము ప్రేమయే గనుక నాస్వభావమును
అట్టిదే అయివున్నది ప్రేమయనెడు నేత్రముతో ఆయనవంక చూడుము
అంతట ఆయన పూర్ణమైన ప్రేమను గ్రహింపగలవు అయితే అయి
షముతోడను అశ్రద్ధతోడను నీవాయనను చూచినక్షణమే ఆయన సం

తక్కంటె నధికునిగా కనుగొనజాలవు ప్రేమతో ఆయనవంక జూడుము. ఆయన నూతనస్వరూపము తెలుపబడినట్లు నీవు కనుగొందువు ప్రేమాబంధము నొకవైపున ప్రేమయుంచుటతో తృప్తినొందియుండదు వుభయవైపులను ప్రేమ యుండితీరవలయును మనయందుగల దేవుని ప్రేమయే మనలో ప్రతిగా ప్రేమను వృద్ధిపింపజేయును ఆయన తన నిరంతర ప్రేమను మనమీద వర్షించుచుండును ఆయనమీద మన అల్పములగు ప్రేమాబిందువులను పడనిచ్చుటవలన మనము ధన్యులమగుదుము అశ్రద్ధతో కూడిన దృష్టివలన ఆయన ప్రకాశమానమైన ప్రేమను నీవు గమనింపజాలవు ప్రేమా సహితమైన పరిశుద్ధమైన జ్ఞాననేత్రముతో ఆయనను చూచినప్పుడు మాత్రమే ఆయన ప్రేమదృష్టి గమనింపబడగలదు ఆయన దృష్టి మాత్రముప్రేమవంటిది యీప్రపంచమునంతను మాత్రముప్రేమయందునవలెనే దానిలో నుంచియున్నాడు ఆయన ప్రేమారసము సృష్టియందంతటను ప్రతివాని హృదయమును ముంచివేయుచున్నది ఆయన ప్రత్యేకముగా ప్రతివాని వంకను చూచుచున్నాడు ఆయన ప్రతి యాత్మయందును ప్రేమయొక్క యిచ్ఛను తీర్చుచున్నాడు ఈప్రపంచములో మరెవరును లేకుండిన ఆయన రాజ్యమునకు నేనొక్కడనే వారసుడనయి యుందును అయితే యితరు లెవ్వడును లేనియెడల ఆయన నావంక నెట్లుచూచునో సరిగాఅదేవిధమున అసంఖ్యాకులైన జనులలో నొక్కడనైన నావంక ఆయన యిప్పుడు చూచుచున్నాడు రాజు తన ప్రజలను ప్రత్యేకముగా ప్రతివానిని స్వతహాగా నెరుగజాలడు అయితే యీసృష్టికి సర్వపిత యీ అనంతమైన సృష్టిలో తన బిడ్డలయందు ప్రతివానికిని ప్రేమాపాశము నందిచ్చుచు

న్నాడు మనము జన్మమెత్తిన దాదిగ మన కాధారమైన వానికిని యీ క్షణమున సహితము తన ప్రేమను మనయొడల చూపుచున్న వానికిని కృతజ్ఞతగల హృదయములతో మనము వందనము లర్పించుచున్నాము మన పూర్ణమయిన మనస్సును పూర్ణమయిన యాత్మను ఆయనక ర్పించుచున్నాము మన పుట్టుక మొదలు మనల రక్షించుచున్న వానికిని మన మాతృగర్భము విడచిన దాదిగ మనల ప్రేమతో పెంచి కాపాడు వానికిని సాగిలపడుము ఆయన యీ ప్రేమ నెట్లు అవిష్కరించుచున్నది మన మీలోకములోనికి పూర్ణమయిన స్వతసిద్ధ జ్ఞానముతో రాలేదు. అంధకారావృతమయి ఖననగు పెట్టెబడ్డవలెనే మన మొకప్పుడు యేమి యు తెలిసికొనలేకుంటిమి అయితే మనము వెలుగుచూచునప్పుడు మన ల కౌగలించుకొనుటకు ఆయన ప్రేమ యెటునుండివచ్చెనో మన మెరు గము అప్పుడు మనలగూర్చి యెవరయినను జాగ్రత తీసుకొనునట్లు చే యుటకు మన మేమి సుగుణములను యేమి ఆకర్షణలను గలిగియుంటి మి అయితే భగవంతుడు ముందుగా మాతృ హృదయమునందు ప్రేమ నుంచి యున్నాడు ఆప్రేమ అన్నికష్టములనుండియు కవచమువలె అ ప్పుడు మనలనురక్షించెను మన ప్రాణసంరక్షణమునకు మాతృస్థనము లయందు పాలను మాతృహృదయమునందు ప్రేమను వుంచియున్నాడు యీ ప్రేమవలనను యీపాలనవలనను మన మొకప్పుడు పెంచబడి కా పాడ బడితిమి మన మాయన ప్రేమకొరకు ప్రార్థించలేదు అయితే ఆయనయంతట ఆయనే తన ప్రేమను దయచేసెను మనకు పళ్లు లేనప్పు డు ఆయన పాలనుకల్పించెను మనకాయన పళ్ళను యిప్పుడు దయచే సెను యిదేవిధమున ఆయన ఆహారమునుకూడ దయచేయుచు న్నాడు

జ్ఞానములేనప్పుడు ఆయన మనలను కాపాడెను మనకిప్పుడాయన జ్ఞానమును దయచేసెను ఆయన యింక మనకు రక్షణను కలిగింపడా మనము సహాయరహితులముగను దుర్బలులముగను వున్నప్పుడాయన ప్రేమతో పెంచెను మనల నిప్పుడు విడచిపెట్టి యా ప్రేమ నింక దయచేయడా ఆయన అప్పుడు మన తండ్రియు తల్లియు సమస్తమును ఆగులాగున అయన యిప్పుడును మన తండ్రియు తల్లియు అయివున్నాడు ఆ దేవిధమున శాశ్వతకాలము ఆయన మన తండ్రియు తల్లియు అయివుండును ఆయన ప్రేమను వదలివేయుము శాశ్వతజీవముతో మన మేమి చేయుదము మన మెల్లప్పుడును అశ్రద్ధగలవారమును అయిష్టము కలవారమును అయినచో యెప్పటికిని మనము తృప్తినొందియుండగలమా ఆయన పూర్ణ ప్రేమను యంతకంతకు స్పష్టముగ మనము గమనింపగలిగిన కొలదిన మన మంత యధికముగ మన ప్రేమను ప్రతిగా చూపుదుము ఈప్రకారముగా మన జన్మమంతయు గడుపబడును మనకు జ్ఞానమును మతమును నేర్పి ఓర్పు క్షమయనెడి అభేద్యమైన కవచమును కలిగించి యీలోకమందు కఠినమయిన విఘ్నములలో ప్రవర్తించునట్లు చేసియున్నాడు మన మిక్కడనుంచి ఆయన శాశ్వతమయిన సహవాసమును అనుభవించుటకు మనము సిద్ధపరచబడుచున్నాము అందరమును ఆయనయెడల కృతజ్ఞతను కలిగియుందము ఆయన మనయెదుట నున్నట్లుగా భావింతము ఆయనతో సరియైన సహవాసమును కలిగి యుందము యీవిధముగా మన జన్మములను ధన్యములుగ చేయుదము ప్రేమయనెడు నేత్రములతో ఆయన పరిశుద్ధమయిన ప్రేమనుచూడుము అట్టివుపకారియు అట్టి స్నేహితుడును యింకెవరును యెట్లులేరో మనము వా

ముందు దేవుని ప్రేమస్వరూపతను చూతుము. ఆయన ప్రేమను వెదజల్లుటవలన తక్కిన యందరి ప్రేమలయొక్క లోపములను తీర్చుచున్నాడు. మన కేమికష్టములు కలిగియుండినను మనహృదయమందెట్టి దుఃఖములుండినను మనమాయన సన్నిధానమునకుబోవునప్పుడన్నియు బాగుపర్చబడును. మనము దేనినాధారముగాగొనబోయినను తుదకుమనము దానియందు నిరాశులమైవచ్చెదము. అయితే మనజీవితమునకు శాశ్వతుడయిన స్నేహితుడు మనతోయెల్లప్పుడు నున్నాడు ఆయన నాధారముగాగొని మనము స్వతంత్రులమగుచున్నాము. స్వతంత్రతగలయిన మానుషత్వము; అదియిప్పుడు సహితము మనకు భూషణమైయున్నది. తదనంతరము దుఃఖమునుండియు, పాపమునుండియు, విడిపింపబడి మనము స్వేచ్ఛగలస్థితిని పొందుదుము అప్పుడు హృదయబంధములనుండి విడిపడుటవలన ధన్యులమగుదుము. సంతోషముల తరువాత సంతోషములను, ప్రేమతరువాత ప్రేమను మనము పొందుచుందుము. మనము శాశ్వతమైన అదృష్టమును పొందుచుందుము. మనయిన్ని ఆశలకు సదానమయిన ఆయన నెయ్యమును విడచియుండవద్దు. ఆయన ప్రేమ నాధారముచేసికొనుము; యీప్రకారముగా అన్నిరోగములనుండియు, అన్నిబాధలనుండియు స్వతంత్రుడవగుదువు. ఆయనమిత్రుడైన స్నేహితుడును, మనము ప్రార్థించుదగిన దేవుడును, మనయిచ్ఛకు ప్రత్యక్షవిషయమును అయియున్నాడు. ఆయనమనస్సు దర్శనముచున్నప్పు ఆయనమన హృదయములయందును శాశ్వతముగా నుండులాగున మన హృదయమునుండి [illegible] ప్రవహింపములాగునను వు[illegible] యిట్టి ఆయనకు మనప్రార్థనలైయున్నది. మనమా

కమునకు ఆయనతప్ప వేరుమార్గమేదియు లేదు. ఆయన ప్రేమయే అంతయు అయివున్నది. ఓహో! పరమాత్మా నీశాశ్వతత్వముయొక్క ఆనందాంబుధి నాయాత్మ నోలలాడించును. నీవుత్కృష్టేచ్ఛతో యెల్లప్పుడును నాయిచ్ఛ యేకీభవించులాగున నీప్రేమాదృష్టియందు నాచూపుయెల్లప్పుడును నిలచులాగున అనుగ్రహింపుము. నీకు విరోధముగా నేరముచేసినప్పుడు వెయ్యిశిక్షల పొందింపుము. అయితేయెప్పుడును నన్ను విడువవద్దు. ఓపరమమిత్రుడా! నీవుదప్ప నాకు వేరుగతి లేదు.

## 6వ ధర్మోపదేశము.

---

“నతత్రసూర్యోభాతి నచంద్రతారకం। నేమావిద్యుతోభాంతి కుతో యమగ్నిః। తమేవభాన్తమను భాతిసర్వం। తస్య భాసాసర్వ మిదంవిభాతి”

పరబ్రహ్మము సూర్యునిచేత ప్రకాశింపచేయబడదు. చంద్రనక్షత్రములచేతను విద్యుల్లతలచేతను ప్రకాశింపజేయబడదు. ఈఅగ్నియేమిజేయగలదు సమస్తమును దాని ప్రకాశము ననుసరించియే ప్రకాశించుచున్నది దాని ప్రకాశముచేతనే ఈసమస్తమును ప్రకాశింపుచున్నది

ఓఋషిశ్రేష్ఠుడా! ఎవని మానసాగోచరమాయున అనంతస్వభావ

షము అనిర్వాచనీయమో. ఎవనిని భక్తిగలిగి సత్పురుషులు జ్ఞానులు ప్రత్యక్షముగ దర్శించెదరో అట్టి ఆనందమే స్వరూపముగాగలిగిన అవి నిరాకారుడగు పరమేశ్వరుని నేనెట్లు తెలుసుకొననగునని, శిష్యుడు తనగురువు నడిగెను. నేనెచ్చట ఆయనను వెదకవలెను? ఎవరాయనను తెలుపగలరు? సూర్యుడాయనను తెలుపజాలడు చంద్రనక్షత్రములును విద్యుల్లతను ఆయనను తెలుపజాలవు. అంతనెట్లు యీ భూమియందలి అగ్ని ఆయనను తెలుపగలదు? అని గురువు జవాబు చెప్పెను. అచ్చట సూర్యుడును చంద్రుడును ప్రకాశించరు అచ్చట అవియన్నియు అంధకారమైయున్నవి. ఆత్మయొక్క జ్ఞానప్రకాశముమాత్రమే ఆయనను తెలుపగలదు ఆత్మయొక్క జ్ఞానప్రకాశముచేత మాత్రమే యీసత్యతేజము తెలుపబడగలదు. అప్రకాశముముందర సూర్యకాంతియు చంద్రికాంతియు మరుగుపరచబడును ఆత్మయొక్క జ్ఞానప్రకాశమువలన మాత్రమే యీదివ్యతేజస్సుయొక్క ప్రభను కొంచెము కొంచెముగా చూడగలము ఆత్మప్రకాశమననేమి? పూర్ణమయిన అంతర్దృష్టిచే నీహృదయమందు నీచూపు నిశ్చలముగా చేయుము; అంతట నీవు ఆత్మప్రకాశమననేమియో యెరిగెదవు. సూర్యచంద్రులస్తమించి నిప్పుచల్లార్పబడిన తరువాత యింక నేయితర వెలుగు నిలచియున్నది? అదియే ఆత్మయొక్క ప్రకాశమైయున్నది. దానిని ప్రత్యక్షముగ తెలిసికొనుటకు బ్రయత్నింపుము. సూర్యుడస్తమించినందున యిప్పుడు సూర్యప్రకాశమేమియు లేదు. చంద్రికాంతి యిచ్చట లేదు. మనయెదుట అగ్నిప్రకాశమును మాత్రమే కలిగియున్నాము. ఈ వెలుగంతయు ఆర్పబడెననియు యిచ్చటంతయు అంధకారమనియు నీమనస్సులో భావింపుము. అట్టి విషయములో యీదీపములచే వెలిగెడి యీప్రార్థనామందిరమునందు

మనమిప్పుడు చూచుచున్న యీయీశ్వరసృజను సలిపిడి పరిశుద్ధుల ఆకారములను చూచుటకు మనమశక్తులముగాము. ఈసుందిరమె యిప్పుడున్నంత నిశ్శబ్దముగనుండి పరమేశ్వరునియందు మన మానసముల నిశ్చలముచేసి ఆయనస్తోత్రములను మనమిప్పుడు వినుచుండినంత నిశ్శబ్దముగానుండినట్టయిన అంతటయీఅంధకారావృతమై నిశ్శబ్దమయినమందిరమునందు మనముప్రత్యేకిని మన హృదయములయొక్క ప్రకాశము అర్పబడకు అంతట ప్రేశవాదును తననుతాను చూచుకొనుటకు శక్తికలుగడగును. హృదయప్రకాశము అంధకారమునందు దొక్క వప్రకాశముగలదియగును. ఆఆత్మతేజముతో సర్వము యొక్క ప్రకాశముకూడ తెలుపబడును. ఆత్మయొక్క అజ్ఞానప్రకాశముతో దానికారణమైనను అర్థాంబడును స్వభావమును దాపుఅంతర్యామునందరి సర్వజ్ఞుడును అగు శాశ్వతత్వమే స్వరూపముగాగలిగిన ఆగాశ్వరుడు తెలుపబడును. సూర్యుడును చంద్రుడును తెలుపజాలనియాయనను ఆత్మయొక్క జ్ఞానప్రకాశముమాత్రమె తెలుపును బాహ్యప్రకాశమువలన ఆయనను చూడగోరువాడుబుద్ధిహీనుడై యున్నాడు అంతర్యామందలి పరమాత్మ హృదయమందుచూడబడవలెననియు హృదయమందుఆయన వెతుకబడవలయుననియు యీజ్ఞానము యెవనికిలేదు? సృష్టియందుఆయన జ్ఞానము యొక్క నీడమాత్రమె మనము చూచుచున్నాము. అయితే ఆయన జ్ఞానప్రకాశమును హృదయమునందు చూచుచున్నాము.

ఆయన ప్రవర్తించుచున్నవాడగుచుండగా సమస్తమును ప్రవర్తించుచున్నది. అన్నివస్తువులును ఆయన ప్రవర్తనము యొక్క నీడయైయున్నది యీయనతేజము హృదయమందున్నది. హృదయమందు

ము విచారింపనవసరములేదు. ఇట్టితలంపులయందు జీవితమును వ్యర్థ పరుచుటవలన ఫలితమేమి? మరణకాలమందు ఇవన్నియు వ్యర్థములును అజ్ఞానాంధకారావృతములును అయియున్నవి. అయితేయెంత ఆశాశ్వతమైశ్వర్యమైనధనమును కూడబెట్టితిమో విచారింపుము. నీవాద్రవ్యమును సంపాదింపగలిగిన అన్నివస్తువులును నీకులభ్యమగును. కాని యీ లోకమందలి దుస్స్వభావులకుమాత్రమట్లుకాదు. ఎంతచులకనగా మానవులు నీతిని నిరాకరించి యీవ్యర్థవిషయములకై వెదకుచుందురు. కొంచెము జనసమ్మతమును, కొంచెము గౌరవమునుపొందుటకు వారెట్లు యీశ్వరుని విడుచుచున్నారు. ఓహో! ఎంత ఆశ్చర్యము! అయ్యో! యెట్టి భ్రమత! వారు దీనినిగ్రహింపరు. వారొకవేళగ్రహించినను భ్రమత వారినాశ్రయించి సత్యము తెలిసికొనకుండ చేయును అశాశ్వతమైన ధనమును, ఆసర్వకాలమందుండెడి అదృష్టమును సర్వదా అనుభవింతుమనెడి ఆశయందు నీవేల ఆనందింపకూడదు? దాని కొం.. లోకములోని సంతోషములను; దుఃఖములను, సుఖములను నివేలనిరాకరింపకూడదు. సూర్యునుగాని చంద్రుడుగాని తెలుపజాలని ఆయన ఆవిర్భావమును సూర్యునివలెను చంద్రునివలెను మనము చూడగలిగినప్పుడు యిచ్చటసహితము మన యనుభవమునందొక చిహ్నమును కలిగియుందుము. ఇట్టి మన స్థితి శాశ్వతమైనచో దుఃఖమేమి వ్యసనమేమి భ్రమతయేమిగణనగలవగును. దుఃఖములన్నియుఅనుభవింపబడగలవగును. దుర్బలదేహము బలముగలదగును. శక్తిహీనమయిన మానసము సామర్థ్యము గలదగును. ఓహో యీ ఆశయందేమి బలము

న్నది ముందు మనకు మార్గదర్శకమిది కాదా మన యనుభవమును
ఆశయు ఒకే విధమున చూచునప్పుడు అంతట సందేహాంధకార మచ్చ
టనేమయిన నుండగలదా కోటి సూర్యులు తెలుపజాలని ఆయన మన
యాత్మయందావిర్భవించు చున్నాడను నది మన యనుభవమై యు
న్నది. ఆత్మయందలి ఆయన ఆవిర్భావము శాశ్వతముగా నుండునను
నిది మన ఆశయై యున్నది. ఓసత్యుడయిన పరమేశ్వరుడా: నా హృద
యమందు నీవు శాశ్వతముగా నుందునను యీ ఆశను నీవే నాకు కలి
గించుచున్నావు. గాన యీ యిచ్ఛ తప్పక నెరవేర్చబడును. అయితే
నీసన్నిధానమందు ఆనందముతో నిండియుండగలుగునట్టియు శాశ్వతకా
లము నీతోకూడ నుండగలుగునట్టియు ఆదినముకొరకు యెంతకాలము
నేను వేచియుండవలయును! ఓపరమాత్మా నీయెదుట దీనత్వముతో ని
లిచితిని యీ లోకమందలి ధనమునుగాని బిరుదులనుగాని గౌరవమును
గాని సంపాదించుటకు నేనిచ్చటకు వచ్చియుండలేదు. ప్రజలు నన్నెట్లు
గౌరవింతురో వారి యధిక గౌరవమునకు నే నెట్లు పాత్రుడనగుదునో
కనుగొనుటకు నీయెదుటకు రాలేదు. నా గర్వలత యంతయు నా పాప
సంపర్కములన్నియు నానుండి తొలగింపబడుటకు నీసహాయమును నే
ను వెదకుచున్నాను. ఓదీనరక్షకా నీశాశ్వతత్వముతో నేనెల్లప్పుడును ని
వసించులాగున యీ నా ఆశను యీ నా కోరికను అనుగ్రహింపుమా.
నీ న్యాయమార్గమును అనుసరించుచూ పూర్ణ హృదయముతో నే
ను ప్రవర్తించులాగునను నీపరిపూర్ణ కరుణాదృష్టియందు నా ప్రేమా
దృష్టి నిలచులాగునను నీయిచ్ఛకు నాయిచ్ఛలోబడి సమస్త విషయము
లయందును నేను ప్రవర్తించునట్లును యీ నా ఆశను అనుగ్రహింపు
ము. ఇదియే నా ప్రార్థన. కోరుటకు నాకు యింక నేమియు లేదు.

7 వ ధర్మోపదేశము.

« ప్రాణోహ్యేషయః సర్వభూతైర్విభాతి » ఆయన సమస్త వస్తువులయందును ప్రాణమై ప్రవర్తించుచున్నాడు.

మన హృదయములయందే దేవుని ప్రకాశమయిన స్వరూపము గలదనియు ఆ ఆత్మతేజము వలన సత్యప్రకాశము తెలుపబడుననియు చంద్రనక్షత్ర విద్యుల్లతల ప్రకాశము ఆయనను తెలుపజాలదనియు అపరిశుద్ధమై నిరాకారమై పరమాత్మ ప్రకాశమానమైన హృదయపంజరములయందు నివసించుచున్నాడనియు, ఆయన మిక్కిలి అంతరంగ్యుడును, ప్రియతముడును అయిన దేవుడనియు, మన ఆత్మయందీ సత్యము స్థిరపరచబడినది. ఇచ్చట ఆయనను ప్రత్యక్షముగా చూడుము. ఈపరిశుద్ధమైన దేవాలయమునందు ఆయన ఆవిర్భావమును నీవు చూడకుండిన, నీవు యిచ్చటకు వచ్చినప్పటియంత వ్యర్థహృదయముతో నీవు తిరిగి వెళ్లిన నీవిచ్చటకు వచ్చుటవలన ప్రయోజనమేమి? ఆయన ఆవిర్భావము నిచ్చట చూచుటవలన పరిశుద్ధపరచబడును. ఈ ధర్మోపన్యాస మిచ్చట తరుచుగా చేయబడుచున్నది; ఆపరమాత్మ మన హృదయమందలి యంతరాత్మయనియు, హృదయమందు ఆయన ప్రకాశమానమయిన స్వరూపమును మనము చూడగలమనియు. మనచిత్తమువచ్చినంతతరచుగాబోధింతము; అయినను అది యవసరము కాజాలదు. అసత్యము నిచ్చట యనుభవమునకు తెచ్చుకొనుము. "ప్రాణోహ్యేష"

పరమాత్మ యనెడు జ్ఞానసూర్యుడెవనియందు తనకు తాను ఆవిర్భవించునో అట్టి పరిశుద్ధునకు ఆయన జీవమై యున్నాడు. తన ఆత్మ

యందు వెలింగెడి సత్య జ్ఞానములయొక్క తేజమును చూచువాడు పరమేశ్వరుడు ప్రాణమనియు, మరణాకృతి కాదనియు, ఆయన శాశ్వతత్వమనియు, జీవమే యనియు తెలిసికొనును. మన దేవుడు నిదురించెడు దైవముకాదు. ఆయన ఎరుకగల జీవించుచున్న యీశ్వరుడు. ఆయన ప్రాణము. ఆయన సృష్టికి ప్రాణము; అంతేకాదు ఆయన ప్రాణమునకే ప్రాణము. ప్రాణమే స్వరూపముగాగల ఆస్తోత్రార్హుడయిన పరమేశ్వరుని మన హృదయమునందు ప్రత్యక్షముగ చూచునప్పుడు మాత్రమే నిజమయిన ఆరాధన అయివున్నది. ఆ ఆరాధన కాలములో మనమాయనను చూడనట్లయిన నిజమయిన భక్తితో ఆయన నెట్లభినందింపగలము? బాష్పనేత్రులమై ఆయన నెట్లు ప్రార్థింపగలము? మనమెప్పుడయినను శవములతో సంభాషింపబోవుదుమా? శాశ్వత తత్వము ప్రాణమునే స్వరూపముగాగల ఆయన ఆరాధకులము మనమయినచో కర్ర, రాతి, మట్టి విగ్రహములయందు చూడబడగలిగిదానికంటె అధికముగ చూచుటకు శక్తివంతులము కాజాలమా? ఆయనప్రకాశమానమయిన స్వరూపమును సర్వదా చూడవలయునను నిదియే మనప్రార్థన. ఆయన నారాధించుటకు పోవునప్పుడు ఆయన పరిశుద్ధ పదములయందు భక్తిపుష్పముల సమర్పించునప్పుడును, ఆయన స్తోత్రపాఠముల పాడుటవలన మనజన్మముల ధన్యములుగ జేయ నిచ్చగించునప్పుడును, మనమాయనను చూడకుందుమా? మనమా పరిశుద్ధ జ్ఞాన తేజస్సును ప్రత్యక్షముగ దర్శింపకుండిన, మన మానసమెట్లు, ఆయన వైపునకు త్రిప్పబడును, ఆయనదృష్టి మనపయి ప్రసరించుటను మనము చూడకుంన మన ప్రేమాప్రవాహము లెవనిమీద ప్రవహించును. కాదు: ఆ

యున స్వరూపమును యిచ్చటచూడుము. ఆత్మ తేజముచేత ఆయనస్వ రూపమునుచూడుము. ఆయన అందరికిని ప్రాణము ఆ సర్వవ్యాపి యిన శాశ్వత పురుషుడు భౌతిక ప్రపంచమునందును, అన్ని ఆత్మల యందును కలిసి మెలసి వున్నాడు ప్రేమాపూర్వములను ఆయన కల్పిం చుటకును యెప్పుడును మానకుందుముగాక? ఇది మన ఘనమయిన ఆ శ్వాసయేనచో నిశ్చయముగా నెరవేరును. ఇప్పుడేమి సంభవించుచున్నదో చూడుము. ఆయనకొరకు మన ఆశ వృద్ధిపొందించినకొలదిని ఆయన మన యందు తనంతట తాను ఆవిర్భవించుచున్నాడు ఈ తేజో కిరణములలో ఆయన ప్రకాశము వెలుగుచుండుటను మనము చూచుము. ఆ అనిం ద్యపురుషుని స్వరూపమును మన హృదయములయందు మనము చూ చుచున్నాము. ఆయన మన స్తోత్రార్హుడయిన దేవుడు; ఆయన జా గరూకుడయి జీవించుచున్న దేవుడు; మన దేహము ఆయన ఆలయము. ఆయనఅచ్చట యెల్లప్పుడునునివసించుచున్నాడు. అయ్యో! మనయొక్క స్వాతంత్ర్యమేమి? మన మాయనను చూచుటకు యెంతదూరముకు నకు పోనవసరములేదు? పరిశుద్ధ స్వరూపుడయినమన దేవుని అభినందిం చుటకయి పోవుట కిచ్ఛగించు నప్పుడు మన ఆత్మయందే ఆయన తన నె తాను తెలుపుకొనుటను మనము చూచుము. సూర్యునికంటెను, చంద్రునికంటెను. అడవియందలి గొప్ప వృక్షములకంటెను, మన ఆ త్మ ఆయనకు ప్రియతమమయిన వాసస్థానమయియున్నది; జ్ఞానము, శా శ్వతత్వము స్వరూపముగాగల ఆపురుషుడు నిశ్చయముగా సర్వదా అం తటను నివసించుచున్నాడు. ఆయననుండి వేరుపడిన సమస్త వస్తువులు

ను మృతతుల్యములుగా జూతుము. ఆయనతో సంబంధింపకున్న అన్ని వస్తువులును మృతమయినట్టుగాను, వునికిలేనివానివలెను కనుబడును. ఆజీవముయొక్క ఆస్తికతవలన సమస్తవస్తువులును జీవించుచున్నవి.

“ చేతనం చేతనానాం ”

ఆయన ప్రాణులకు ప్రాణి: ఆ ప్రాణముయొక్క అవిర్భావము వలన సమస్తవస్తువులును ప్రాణముగలవి యగుచున్నవి. ఆయన జీవ స్వరూపమును గ్రహించుటవలన యీసృష్టి ఆస్తికతను కలిగి యున్నది. ఆశాశ్వతత్వము నాధారముగాగొని శాశ్వతత్వమునకు హక్కుదారుల మగుచున్నాము. శాశ్వతత్వమునకు మనము పుత్రులమై యున్నాము. కావున శాశ్వతత్వమునకు వారసులము. ఈ ప్రాపంచక బంధములలో తగులుకొనినంతకాలము మరణమునకయి బంధింపబడుచున్నాము, అం[illegible]. మృత్యుదేవత కౌగలిలో మనము ప్రవేశించుచున్నాము. భూలోకమందున్నయు మరణ స్వరూపములు శాశ్వతత్వముయొక్క జాడ యెచ్చోట నేమియు లేదు. లోకము మరణ స్వరూపము. యీశ్వరుడు శాశ్వతత్వమునకు నివాసము. ఆయనతో మనసంబంధము కలిగిన క్షణమే లోకమునకంటె అతీతమై వున్నతమయిన పరమాత్ముని నివాసమును మనముచూతుము.

అంతట మనము తత్క్షణమే యిట్లుపలుకుదుము “యాయేతత్ విదురమృతాస్తే భవంతి” యివన్నియు శాశ్వతత్వము గలవి యగునని యి

చ్చుట తెలుసుకొనము. ఆశీవముతో తనను చేర్చుకొనిబోవు మార్గ మునకు భయపడను. వాడు శాశ్వతత్వమును పొందుటకు నిశ్చయ పర చుకొనును. మన ఆత్మ ఆయనపీఠము; ఆయన మన స్తోత్రాపాత్రుడ యిన దేవుడు? మన ఆరాధన బాహ్యమయినదికాదు? కాని, ఆంతరం గికమాయినది ఓహో!? మన ఆత్మలయందు యీశ్వరుని ఆవిర్భావము ను మనము జూచునప్పుడు మనమెట్టి యానందము ననుభ వింతుము! ఆయనను దర్శించు నిమిత్తము కొందరెంతెంత కష్టముల పొందుచు న్నారు కొందరెట్టి కఠినవ్రతములచే తమశరీరములను శోషిల్లజేయుచు న్నారు? వారు తమయాత్మలతో దేవునియందు సంబంధమును గుర్తెఱు గరు. వారు బాహ్యకర్మలవలన ఆయనను వెదకెదరు కావున వారు ని రాశులయి మరలెదరు. కావుననే బ్రహ్మ మతమందిట్లు చెప్పబడి యున్నది.

"యోవాఏతదక్షరం గార్గ్యవిదిత్వాஉస్మిన్లోకే జుహోతి యజతే తపస్తప్యతే బహూనివర్ష సహస్రాణ్యంతవ దేవాస్య తత్ భవతి" ఆయనను తెలియనివాడు వెయ్యిసంవత్సరములు యజ్ఞములును తపస్సును చేసినప్పటికిని దాని కంతమును శాశ్వతమయినప్రతి ఫలమును పొందజాలడు, పాలింపనగు విషయములచే వాడు బంధింపబడును.

దేవునిమీద మన హృదయమును శాంతచిత్తముతో నిలిపిన క్షణమున మన యదృష్టమునకు అంతమెక్కడ? మన ఆత్మలయం దావిర్భవించిన పరమేశ్వరుని మనము సులభముగా చూడగలము. ఆ

యొక అసిస్త్రత్వములోనదలి అవిశ్వాసమునుండి మనలను ఆయన అనుగ్రహామూలమున విడిపించుకొని ఆయన సంతటను జూచునప్పుడు మనము పాపములను విఖులంతుము, ఆయన అస్తిత్వయందలి అపనమ్మకమంతటినుండియు తొలగి సత్యజ్ఞానానందస్వరూపుడయి అశాశ్వతుడయిన పరమేశ్వరుని నేను ప్రత్యక్షముగా తెలుసుకొనునప్పుడును ఆయన దృష్టి నానేత్రములను కలుసుకొనుచున్నట్లు నేను జూచునప్పుడును ఆయనకును నాకును సమీప బాంధవ్యముండినప్పుడును ఆయనకును నాకును మధ్య వేరుపరచునదేదియు లేనప్పుడును, ఆయన నాతండ్రి, నేనాయన పుత్రుడను, ఆయననాగురువు, నేనాయన శిష్యుడను, ఆయన నాతల్లి, నేను ప్రియమైన పదార్థమును, అంతట నేను నాహృదయమందిట్లు చెప్పగలను "త్వంగ్ యప్ పితాయోన్మాకం అవిద్యాయాః పరిజ్ఞానో అస్మి" లోకముయొక్క అంధకారపు హద్దులను మించి నడిపించెడినీవు మాతండ్రివి, అంతట నేను నిష్కపటముగా యిట్లుప్రార్థింపగలను.

"నమ తేనపు త్రాక్ రచసర్వ్రక్షీతః పసిరక్ష్యాంచసితే యువాయి తీః" తల్లివలె రక్షింపుము. మాకుఅభివృద్ధిని జ్ఞానమును దయచేయుము

పరమేశ్వరుని అధికము కల్గించెడి తండ్రివలెను జ్ఞానమునుదయచేయు గురువువలెను ప్రేమను కనుపరచెడి తల్లివలెను యివన్నియు చేరినవానిగా మనమాలోచించునప్పుడు ఆయన ప్రేమను పొందుచుండగా ఆయనయందెంతబలమయిన నమ్మకముమనకుకలుగును! ఆయన మనలను చూచుచున్నాడనియు ఆయన మనలను జ్ఞాపకము వుంచుకొనుచున్నాడనియు ఆయన మనలను ప్రేమించుచున్నాడనియు, ప్రేమభావ

ములను విడుచుచుందుము. మన యాలోచనలన్నిటితో యాఅన్నితల
వులను యేకమొప్పను మనయందు నూతనజీవము పట్టునుఆయనను పొం
దినతరువాత అన్ని మహాత్మ్యములును మనకు తెలసినవగును ప్రాపం
చికవ్యాయ యింకలేదు. మన నేత్రముల ప్రసరింపజేసినప్పుడు సమస్త
మును ఆయనతో నేకీభవించునప్పుడు చూతుము. మన స్వదేశములోన
యినను లేక పరరాష్ట్రములోనయినను యెల్ల ప్రకాశములను ప్రతి స్థి
తియందును ఆయన మహిమను మనము కనుగొందుము.

"ప్రాణో మేష యాసర్వ ఉదయర్విభాతి" ఆయన సమస్త వస్తు
వులయందును ప్రాణము ఆవిర్భవించుచున్నాడు. "విస్వాతా స్వక్షు
రుత విశ్వాతో ముఖో విశ్వాంతో హాయుత విశ్వాత తత్వాత్" ఆ
యన నేత్రములు లోకముమీదను ఆయన ముఖము లోకము వయిపు
నకును, ఆయన హస్తములు లోకముమీదను ఆయన పాదములు లో
కముమీదను వున్నవి.

ఆయన నేత్రములు నామీద నున్నట్టుగానే అవి సృష్టిమీదను
న్నవి. వృక్షవర్గముననందును పక్షిరెక్కలయందును సముద్ర గాంభీర్య
మందును పర్వత ఘనమునందును ఆయనహస్త మంటిటనున్నది ఆయ
న శక్తిస్వరూపము ప్రతిభూతమునందును కలదు ఆ ప్రాణముయొక్క
అస్తికతవలన లోకము జీవించుచున్నది. సమస్త నిర్మాణములయందు
ను ఆయన జ్ఞానమును, ప్రతికార్యమందును ఆయనమంగళస్వరూపమును
సృష్టియందంతటను ఆయన ప్రేమయు గోచరించుచున్నవి. దుఃఖముతో
డను రోగముతోడను మనము కూడియున్నప్పుడు ఆమాత్రు ప్రేమయం

దు శాంతమును బొందుదుము. ప్రాపంచిక ప్రేమయందు నిరాశులమ యినప్పుడు ఆయన ప్రేమయందు మగ్నులమగుదుము. ఆయన జ్ఞానము, ఆయన ప్రేమ, ఆయన సమంగళస్వరూపము సృష్టియందంతటను ప్రతిచోట ను వున్నవి ఓహో! నేనిప్పుడేమి చూచుచున్నాను? నేనెక్కడవు న్నాను? నేను భూభాగములయందు లేను; స్వర్గ ప్రదేశములయందు లేను; దైవమహిమయొక్క అఘనమయిన స్థానమునందు నివసించుచున్నాను. ఈ ఆనందమునంతయు నా మానసమిక యేమాత్రమును భరింపజాలదు. నా కార్యములేమి తెలుపగలవు?



## 8 వ ధర్మోపదేశము.

" ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే। తయోరన్యః పిప్పలంస్వాద్వత్ త్యనశ్నన్ నన్యో అభిచాకశీతి " ఒకే వృక్షము నాశ్రయించుకొని కలిసి ఒకదానికొకటి స్నేహితులుగానున్న రెండు చక్కని రెక్కలుగల పక్షులు కలవు; ఒకటి రుచ్యములగు ఫలముల ననుభవించుచున్నది; రెండవది యనుభవించక కేవల సాక్షీభూతమ యియున్నది.

మానవాత్మయు పరమాత్మయు ననెడి రెండు చక్కని పక్షులు గలవు. పరమాత్మయొక్క సౌందర్య ప్రతిబింబమువలన మానవాత్మ సౌందర్యము కలదగుచున్నది. జీవాత్మయు పరమాత్మయు దేహమనె

డి యొకేవృక్షము నాశ్రయించుకొని యున్నవి. అవి సర్వదా కలిసియు
న్నవి. పరమాత్మ ఆధారముగను జీవాత్మ ఆధేయముగా నున్నవి. అవి
రెండును ఒకటికొకటి స్నేహితులయి వున్నవి. పరమాత్మ ప్రేమాదాన
ముచేత జీవాత్మను పెంచుచున్నది. జీవాత్మ తిరిగి పరమాత్మ యొక్క
మంచికార్యమును భూమియందు చేయుచున్నది. దీనికొరకు అవి ఒక
దానికొకటి స్నేహితులయి వున్నవి. వానిలో నొకటి ఫలముల నను
భవించుచున్నది. జీవాత్మ దైవకార్యమును నెరవేర్చునప్పుడు జన్మసౌ
ఖ్యములన్నిటి ననుభవించుచున్నది. రెండవది యనుభవింపక చూచుచు
మాత్రమున్నది. పరమాత్మ తన ఆధీనులగు నబిడ్డలు ఆనందాంబుధిలో
లలాడుచుండుటను సాక్షీభూతముగా జూచుచు దానివలన తలిదండ్రుల
మాదిరి తృప్తి నొందుచున్నది. జీవాత్మకును పరమాత్మకును గల యి
దియొక విధమయిన సన్నిహిత సంబంధము. ఒకటి ఫలములననుభవిం
చుచున్నది రెండవది వానిని సమకూర్చుచున్నది. జీవాత్మ పరమా
త్మ కరుణావృష్టిచే కురిపించుచున్న సౌఖ్యములను కృతజ్ఞతతోడను, వి
ధేయతతోడను అనుభవించుచున్నది. జీవాత్మ పరమాత్మనుఆధారము
గాగాని స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నది. ఆత్మయొక్క స్వాతంత్రియము
నుజూడుము. అది యేవిధమునను నెవరికిని లోబడదు. ఆత్మ యొక్క
స్వాతంత్రియమందు యెట్టి సౌఖ్యమున్నదో ప్రతివానికి దెలియును. మ
న మప్పుడప్పుడు ఆత్మను అస్వాతంత్రియమయిన దానిగా కనుగొనుచుం
డెడి ప్రపంచమాదలియ నేకవిషయములలోను అసంఖ్యాకములయిన స్థితుల
లోనుదానిఆంతర్యస్థితియుంకనుస్వాతంత్రియమైనదై యున్నదిస్వాతంత్రియ
మనెడి అదృష్టమేదానిసౌఖ్యమంతయు అయివున్నది దానిస్వాతంత్రియమే

దానిదుఃఖమాంతయు అయివున్నది అయితే దేవునియందు విధేయతగలజీవాత్మ కెట్టిసౌఖ్యముగలదో జూడుము. దానిసౌఖ్యము ఆయనస్నేహితుడును ఆయనకయి వేచియుండువాడును, ఆయనసేవకుడును, ఆయన ఆరాధకుడును అయి వుండుటలో నున్నది. దాని యిచ్ఛను పరమాత్మ యిచ్ఛకు లోబరచి ప్రవర్తింపగలుగుట యనునదే దానిఘనతయైయున్నది. ప్రాపంచిక విషయములనుండియు, యిచ్ఛాకర్షక సుఖములనుండియు స్వతంత్రస్థితిని పొందుటయేల కోరబడదగినది? ప్రాపంచిక బంధములనుండి విడిపించుకొని దేవునికి పూర్ణవిధేయులమయి యుండుటయును మనము సర్వదా ఆయన పాదములవద్ద నివసించుటయును, ఆయన ఆరాధకులవలె మన మాయనను పూజించుటయును, ఆయన సదుద్దేశముల పూర్తిపరుచున దంతయును, మనము సంతోషముగా చేయుటయును యనెడి దీనికొరకు మాత్రమే మోక్షమనగా బాధనుండియు, దుఃఖమునుండియు, ప్రాపంచిక బంధములనుండియు విడిబడుటమాత్రమే యయినచో, ఆ స్థితియందు దేవునిస్తోత్రము చేయుటకును పూజించుటకును ఆయన సత్కార్యములను నెరవేర్చుటకును మనకు స్వాతంత్ర్యములేకుండిన ఆజడస్థితియందు మనమేమి చేయుదము? ఆత్మసౌఖ్యము దేవునికి లోబడుటలోనున్నది దాని ఘనత ఆయన ఆరాధకుడగుటలో నున్నది. ఆయనను స్తోత్రించి పూజించుటకును ఆయన సత్కార్యములను నెరవేర్చుటకును, అది హక్కుగలిగి యున్నదను సదియే అన్నిటికంటెను యెక్కువయినదాని యదృష్టమైయున్నది.

మనకు ప్రభువును, దైవమును, ప్రాణదాతయు అయిన ఆయ

న మన స్నేహితుడగుచున్నాడు. ఆయనయందేసుకొనవలెనంటుట యే
నను, ఆయన ప్రియముఖమును జూడకుండుటవలనను, మన జన్మ వ్యర్థము
యినది. ఆయన మనలను ప్రేమించుచున్నాడు. మన ప్రేమను ఆయనని
రీక్షించుచున్నాడు. ఆయన ప్రేమనుజూపుటవలన మన ప్రేమను ఆయ
నవయిప్పుడు ఆ పేక్షించుకొనుచున్నాడు. ప్రేమ పూరితమయిన నేత్ర
ములతో ఆయన మనవంక చూచుచున్నాడు. ఆత్మాభి వృద్ధిని కలిగిం
చుచున్నాడు. మాతృానందమగ్నునుగ చేసి ఆయన తన యిష్టాన కా
పేక్షించుకొనుచున్నాడు. మన ప్రేమను ఆయన కిచ్చుటవలన ధన్యులము
గుచున్నాము. కావున జీవాత్మయు పరమాత్మయు రెండును ఒకదాని
కొకటి మిత్రులయియున్నవి. మన అల్పయింద్రియములవలన పొందెడి
సుఖములకు సహితము మనము హద్దు పెట్టలేము. జ్ఞానధర్మ. ప్రేమా
నిధియగుదానినుండి ప్రవహించు నిర్మల సుఖములను మనమెట్లు గణన
చేయగలము? యీ ప్రేమ, యీజ్ఞానము, యీ ఆనందము, క్రమాభివృ
ద్ధినొందుచుండుటకు మనము చూచునప్పుడు మనము కృతజ్ఞత నెట్లు కలి
గియుండగలము? నా స్వలాభమునకే నాకృతజ్ఞత యభివృద్ధి నొందుచు
హద్దుల నన్నిటిమీరి ప్రవహించునపుడు సమస్తమునకును దేవునికి కృత
జ్ఞత జూపవలసియున్న యేమాటలు తెలుపగలవు? దేవునికి నాయందు
గల ప్రేమనుగూర్చియు, నామీద ఆయనకు గల కరుణాదృష్టిని గూర్చి
యు, చెప్పుటకు మాటలు అసమర్థమయినవైన దీని నాలోచించునప్పు
డు నామానసము నిర్విణ్ణమగునదయిన, యీఅనంత సృష్టియందలి అ
సంఖ్యాకములగు జీవకోటులపై బరుపుచున్న దేవుని ప్రేమను, కరుణను.
నమ మానసమెట్లు గ్రహింప గలదు? అందరును సర్వసోదరి బంధమున

లోకమున మనమిచ్చట యనుభవించుచున్న ఆయన నిర్హేతుక జాయమాన కరుణాళుత్వమునకు మన మేమాటలవలన మన మేమానసిక శక్తులవలన, మన మేవిధమున పరమేశ్వరుని అభినందింప గలము? దేవుడింకను మన స్నేహితుడయియున్నాడు. మన మిట్టి గొప్ప స్వాతంత్రియమును కలిగియున్నాము? దేవతలకు దేవుడును, రాజులకు రాజును. అయిన పరమేశ్వరుండు తనదృష్టిని మనమీద నిలిపియున్నాడు. ఆయన తనసృష్టిని మనయందుంచుటయే గాక ఆయన మన స్నేహితుడుకూడా అయియున్నాడు. ఉన్నతస్థితియందుండు పురుషుని మన స్నేహితుడని పిలుచుటకు మనము సందేహింతుము. అయితే ఆఘనుడయిన యీశ్వరుని మన స్నేహితుడని పిలుచుటకు మన మెప్పుడును వెను తీయము. అవును, దేవతలకు దేవుడయిన ఆ రాజప్రేమయు మనప్రేమయు నేకీభవించుటవలన మన స్నేహితుడయియున్నాడు. ఆయనకు మిత్రులమైయుండుట మన సంతోషమయి యున్నది. మనలను కాపాడువాడుగా నుండుట ఆయన కోరికయై యున్నది. ఆయనను మనము మన ప్రభువునువలె సేవించుచున్నాము. ఆయన మనలను తన సేవకులనువలె పోషించుచున్నాడు. మన మాయనను “ఓహో! నీవు మా ప్రభువవు మా ఆధారుడవు. మా స్తోత్రార్హుడయిన దేవుడవు మా రక్షకుడవు మహా ప్రభువునైన పురుషా” నీవు మాగొప్ప ప్రభుడవు” అని ఆయనను పిలుచునప్పుడు మన పూర్ణహృదయము దానికి “తథాస్తు” అని పలుకును మన హృదయములు పరమేశ్వరునియందు నిలపకుండిన దేవునియెడల ఆశనుమన హృదయములు కలిగియుండకుండిన, మనమాటలును మనతలంపులును ఒకదానితోనొకటి యేకీభవింప జాలవు. సాధించక విషయముల

వారికి క్రమమయిన మార్గమునకు త్రిప్పుటకుగాను ఆయన వారిని శి
క్షించును. దేవుని వాక్యము వారలతో "నన్నెప్పుడు మరువవద్దు. నా
యొద్ద కెగసి వరములను అనుభవింపుము. అయితే నా రక్షణలోను నా
ఆదరణలోను వుండుము" అని పలుకును. లోకమంతయు దాని పూర్ణ
అభివృద్ధితో, ఆయననుండి మనము నిరాశులమగుదుమనెడి భయము
నుండి, మనలను కాపాడజాలదు. మనమాయనయందు నిరాశులమైన
పుడు సృష్టియంతటిలోను మనదుఃఖమును పోగొట్టగల మాట్టి ఆనంద
మిచ్చుట లేదు. ప్రాపంచిక సుఖములకు యాశకై తృప్తిపడుచు సమ
ర్థత ఆయన కలిగించియుండలేదు. ప్రాపంచిక సుఖములతో మన
ము తృప్తినొంది యుండగలిగిన యెడల ఆయన నిర్మలానందమునకై
పూర్ణదృష్టి కలిగియుండము. ఈపనికే సుఖముచు దుఃఖముతోడను,
అదృష్టమును దురదృష్టముతోడను, యేఅపాయమును లేని ఆ పవిత్రదేశ
ముందు శరణుజొచ్చుటకు ఆశగలిగి యుండులాగున ఆయన మిళితము
జేసియున్నాడు. ప్రాపంచికవిషయ కంటకములవలన పీడింపబడి శాశ్వ
తుడగు ఆయన శరణమునకయి ఆయనను ప్రార్థింతము. ప్రాపంచి
క విషయాగ్నియందు మనదేహములు కమిలి ఆయనచల్లని జీవజలమున
కయి ఆసింతుము. ఆత్మాభివృద్ధితో పాటు విషయానందముల యంద
లి ప్రీతి తగ్గినకొలదిని దేవునియందలి మనసంతోషము వృద్ధిపొందును.
అప్పుడు ప్రపంచము దైవకార్యములు చేయు స్థలమైయున్నది. దేవుడు
మన ఆనందమునకై యున్నాడు. మనమిప్పుడా స్నేహితునితో యు
న్నాము. ఆయనకు ప్రేమ భావముల నర్పింపుము. భక్తియనెడు కా
నుకను ఆయనకు దర్శించుము. ఆయనవద్దకు కృతజ్ఞతతో నిండిన హృద

యముతో వెళ్ళుము. నీకుగల సమస్తమును ఆయన కర్పించుటవలన నీజన్మను ధన్యముగ చేసికొనుము.



9 వ ధర్మోపదేశము.

"ఇహైవసంతో ऽథవిద్మస్తద్వయమ్। నచేతవేదీర్మహతీవినష్టిః యయే తద్విదురమృతాస్తే భవంతి। అథేతరే దుఃఖమేవాపిహంతి॥

మన మిచ్చటనుండగానే ఆయనను యెరుంగుదుము; లేనట్లయిన మన మజ్ఞానులము. మన నాశనము గొప్పది. ఆయనను తెలిసినవారు శాశ్వతులగుదురు; యితరులు అనగా ఆయనను యెరుగనివారు దుఃఖితులగుదురు.

ఇచ్చటనుండగానే మనమాయన నెరుగుదుము; మన మాయన నెరుగకుండిన గొప్ప నాశనమును పొందెడివారమే. అప్పుడు మన గతి దృష్టమేమైయుండెడిది? లోకమంత అంధకార బంధురముగ గన్పట్టెడిది! కష్టములవలనను దుఃఖములవలనను మన మెచ్చటను విశ్రాంతి స్థలమును పొందలేకుండెడివారము. ఇచ్చట బాహ్యాంతర శత్రుశరములచే గ్రుచ్చుకొనబడి మనమేస్థలమునను నిర్వృతిని పొందకుండెడి వారమే. పాపచితాగ్ని మన దేహములనంతను సర్వదా కాల్చుచుండెడిదే; దానికి ప్రతిక్రియనేమియు కనుగొనకుండెడి వారము. అది అట్లయినచో బ్రతుకు మనకెట్టి భారమయ్యెడిది! అయితే దేవుని యనుగ్రహమువలన ఆయన

తనను తాను మన సంతోషముకొరకు ధారపోసికొనెను! దుఃఖకారము చే కృశించెడి మన హృదయములను ఆయన మనయందావిర్భవించుటవలన పునర్జీవింప చేయుచున్నాడు. మనమిప్పుడు సహితము దీని ప్రత్యక్షమయిన యనుభవమును కలిగియున్నాము మన దుఃఖము లన్నిటిని మనోబాధలన్నిటిని ఆయన ఆశ్రమమువలన మనమెల్లు మరచుచున్నాము! అట్లు ఆయన శాశ్వతమైన ఆత్మతో మనము కలసియున్నప్పుడు, దాని ఫలితమును అప్పుడెక్కడనో యనుభవింతుము ఇది ప్రత్యక్షమయిన పర్యవసానము. దానికొరకు భవిష్యత్కాలమునకై వేచియుండవలసినది లేదు. సంతోషము లన్నివైపులనుండియు మనమీద ప్రవహించుచున్నవి. ఆయన ఆరాధన ఫలములను సిద్ధముగా అనుభవించుచున్నాము; ముందుకు కనిపెట్టుకొని యుండవలసినది లేదు. ఆయన ప్రత్యక్షముగా తనకు తాను అర్పించుచున్నట్లు ఫలములను ఆయన తక్షణమే దయచేయుచున్నాడు! శాశ్వతకాలమయినను ఆరాధింపవలయుననెడి మన ఆశను ఆయన ప్రతి నిమిషమును తృప్తిపరచుచున్నాడు. ప్రతి నిమిషమును యీ ఆశ యెక్కువ ప్రకాశమాన మగుచున్నది. పాప భూయిష్ఠుల మగు మనమే యీ క్రింది అశాశ్వతలోకమున యిచ్చటనే ఆయన సహవాసము వలన గలిగిన సంతోషముల ననుభవింపుచుండిన అంతకంతకు ఉన్నతలోకములకు వెళ్లినకొలదిని ఆయనతో సర్వదా ఆనందింప గలుగుదుమని యెవరు సందేహింప గలరు. ఆయన ఆవిర్భావమును భవిష్యత్కాలమునందంతకంటె యెక్కువ ప్రకాశమానమైన దానిగా చూతుమనియు, సర్వదా ఆయన సహవాసము ననుభవింపగలమనియు, ఆయన నుండి యిక వేరుచేయబడమనియు, ననెడి న

మ్మకమునందు మనమిచ్చట బలపరచబడుచున్నాము.

మనమాయనను నెరుగకుండిన గొప్ప నాశనమును పొందెదిమి వ్యాపారమే. ఇచ్చట స్వల్ప విషయములన్నిటితో కలవరపరచబడి మరణకాలమునందు సహితము ఏ యాశయు లేక, వృద్ధాప్యమువరకును మనము కృశించుచుండెడి వారమే. ఇచ్చటి ఖయిదీవలె మన హృదయముల యందు అప్రకాశకిరణ మొకటియైనను చొరకుండగనే మన దినములు గడపియుందుము అయ్యో! ఆయన నెరుగకుండిన మనము గొప్పనాశనమును బొందియుందుము; అయితే దేవుని కరుణను గుతికాంఛ్రము; ఇచ్చటనే ఆయనయందు మన సుఖములను పొందునట్లు ఆయన దయ చేసియున్నాడు. శాశ్వతకాలము మన సంతోషము లాయనయందు పొందుదుమనెడి యీ ఆశను ఆయన కలిగించెను. చంద్ర నక్షత్రముల ను మృగవిహగములును మొదలయు దీనివంటిది కాదు. చంద్రనక్షత్రము లు ఆయన తమ యంతరాత్మయని యెరుగవు క్షుద్రజంతువులు వాని జీవమును ఆయనయందు కలిగియున్నవి; అవి ఆయనవలన కాపాడబడుచున్నవి. అవి ఆయనయందు నివసించుచున్నవి. అయితే సింహ వ్యాఘ్ర భల్లూకములు వాని వాంఛలను తీర్చుకొనుటయందు పని కలిగి యున్నవి; తమ కాధారమును దయచేయుచున్నవానిని అవి యెరుగవు ఆయన మానవునియందు మాత్రమే ఆవిర్భవించుచున్నాడు ఆయన వి ధాయకముగా పరిశుద్ధ హృదయులయినమహాత్ములయం దావిర్భవించు చున్నాడు; అయితే ప్రాపంచిక సుఖములవలన మత్తులయినవారును, విషయవాంఛల తృప్తిపరచుటయందు ప్రవర్తించువారును, పాతకులు

యినను యెన్నడును ఆయనను తలచరు; అజ్ఞానాంధకారా వృతులగు మానవాత్మలకు సహితము ఆయన అప్పుడప్పుడు మెరుపువలె ఆవిర్భ వించును నిష్కల్మషులును దయాసహితులును నయిన పరిశుద్ధులయం దాయన ఆవిర్భవించుట ఆశ్చర్యముకాదు; అయితే గొప్ప విషయవాం ఛాపరాయణుని హృదయములోనికి వజ్రకవచముల భేదించుకొని ఆ యన ప్రవేశించునపుడు ఆయన యెట్టి సాటిలేని ప్రేమ కనుపరచుచు న్నాడు! పరిశుద్ధహృదయుడు ఆయనతో ఆనందమునందు ఏకీభవించి యున్నాడు. గొప్పపాపి అనేక కష్టములను బాధలను అనుభవింపుచు చివరకు ఆయన కౌగిటిలోనికి వచ్చుచున్నాడు తనను తలచినవానిని స హితము ఆయన ఆదరించుచున్నాడు. ఏదోనొక పరిశుద్ధ నిమిషమునం దు వాడు దేవుని జ్ఞాపకముంచుకొని నంతనే భాష్పనేత్రుడగును. బ హుశా దేవుని యొక్క ఆవిర్భావము వాని జన్మము నెప్పటికిని మార్ప వచ్చును. బహుశా అంతటి మంచి దైవత్వము వానియందు శాశ్వతమై యుండవచ్చును. దేవుడు పాపులను తన సన్నిధానమునకు యీ విధ ముగా తిరిగి రప్పించుకొనుచున్నాడు. ఆయనకు సమయము దొరుకక పోయినను. ఆయన తగు సమయమును వెదకును. ఆయన యెప్పుడావిర్భ వింపవలయునో తన సన్నిధానమునకు వచ్చుటవలన వారెప్పుడు శాంతచిత్తులగుదురో ఆకాలమునకై ఆయన విచారించును. ఆయనను మనము తలచకపోయినప్పటికిని ఆయన యెప్పుడును వూరుకొనలేదు. అ యితే ఆయన మనల నెప్పుడు ఆదరించగలడో దానికై సమయములను సర్వదా వెదకుచుండును. ఆయన ప్రతివానిని అందరిని ఆదరించుటకు సిద్ధముగనున్నాడు.

ఓ కృతఘ్నులగు మానవులారా! రక్షకుడైనాయనను తెలిసికొనగదా! ఆయన యీ ప్రేమకొరకును, యెడతెగని కరుణకొరకును కీర్తికై యుక్తుడైన ఒకసారి అయినను అభివందింపరా! ఓ స్వామీ! మనమెంతో అజ్ఞానులుగా యున్నాము! ఆయన సర్వదా తన సన్నిధానమునకు మానవులను పిలుచుచున్నాడు. అయితే ఆసర్వదాతయైన ప్రియమైన పిలుపును మనమెప్పుడును లక్ష్యపెట్టము. శాశ్వతత్వమనెడి జలములో మనలముంచుట ఆయనకోరికై యున్నది అయితే ఆయన నెప్పుడును మనము లక్ష్యపెట్టము. ఆయన ప్రేమ నెప్పుడును మన కందించుచున్నాడు. అయితే మనకోరికలేదు ఆశలేదు. ప్రేమలేదు. కావున ఆయన ప్రేమను మనము సాధింపజాలము. ఎప్పుడు మనఆత్మను ఆయనకు సమర్పింతుమో అప్పుడు ఆయన దానిని పూర్ణముచేయును. అందముతో పూర్ణమైనదానిగా ఆయన పుష్పమును సృజించెను. కాంతితో పూర్ణమయినదానిగా సూర్యునిచేసెను, మన ఆత్మను తనతో పూర్ణమయినదానిగా ఆయనచేసెను ఈశాశ్వితమైనఆధారము యెన్నటికిని చెడదు మన ఆదరణశక్తి అధికమైనకొలదిని అది యెక్కువ యిచ్చును.

అనేకులు ఆయనను యిచ్చుట తలపకున్నను. ఆయన అందరిని బాగుజేయుచున్నాడు; ఆయన యెవరిని యెన్నడును విడువడు. ఆయన కుటుంబమందలి యేబిడ్డయును సర్వకాలము అధోగతిని చెంది యుండదు; ఆయన సన్నిధానమునకు పాపులను పరిశుద్ధులను కూడ ఆకర్షించుకొనును. ఆయన అలింగనబంధముతో అందరిని బంధించును. ఆయన ఆనందస్వరూపమునందిది మన నమ్మకము. ఈలోకమునందిచ్చుటనే

ప్రేమయందును నీతియందును అందరును అభివృద్ధిపొందుదురు. పరమేశ్వరుడందరిని హృదయములను ఆక్రమించుకొనును. లోకముయొక్క కల్మషము క్రమముగ నశించిపోవును; ఆయన మతము ఆయనరాజ్యము లో వ్యాపించును. సోదరులవలె అందరును కలసి పరమేశ్వరుని పాదములను పూజింతురు. తమ అదృష్టమును తాము తెలసికొని వారు పూర్ణస్వరముతో "మనమాయన నెఱుగకుండిన మనము గొప్పనాశనమును పొందెడివారమే" యని పలుకుదురు. ఎట్లు యీ సుఖకరమయిన రాజ్యమును కలిగింపవచ్చునో మనబుద్ధితో మనము తీర్మానించలేనంత దుష్టస్వభావులమై యున్నాము; అయితే యీశ్వరుని ఆనందస్వరూపము మన హృదయములయందు ప్రకాశించునప్పుడును, సత్యముయొక్క బలము మన మానసములకు గోచరించునప్పుడును, ఏకమనస్కులగు మానవులందరును దేవుని ఆరాధకు లగుదురనియు. యేక హృదయులై ఆరాధింతురనియు, నీతియందును, ప్రేమయందును అభివృద్ధి పొంది ఆ ఒక్కడేయైన పరమపితను విధేయతతో ఆధేయులై యుందురనియు మనము నమ్ముదుము. దేవుడందరిని ఆశీర్వదించును. ఆయనకై ఆశకలిగి యుండువానిని ఆయన తృప్తిపఱుచును. ఓహో! ఆయనను యిచ్చటనే మనము తెలసికొనుట ఆశ్చర్యము. హద్దుగలిగి అల్పజీవులమగు మనము ఆ శాశ్వతుడయి అనంతుడయినవానిని తెలసికొనెడి యదృష్టమును మనమింకను కలిగియున్నాము. ఆయనను మనము తెలసికొనినట్టయిన యింక తెలసికొనవలసిన దేమి కొఱత యున్నది?

"తస్మిన్ భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి" ఓ! ము

షి, దీనిని తెలిసికొనిన సమస్తమును తెలిసిన దగుచున్నది? ఆసత్యమును మనము తెలిసికొనవలసియున్న సమస్తమును సామాన్యముగా నెరుగుదుము. సత్యము జ్ఞానమునకు పునాదియైయున్నది, దేవుడయిన వాడు పరిపూర్ణుడయియున్నాడు. ఆయన సర్వదా తృప్తుడై యున్నాడు; జ్ఞానముయొక్క తృప్తికి ఆయనే నిధియయును పరిశుద్ధులయిన ఋషులు పూర్ణమయిన శాంతిస్వరూపయియుండి, నిష్కాములయి ఆయనను పొందినప్పుడు జ్ఞానమువలన తృప్తినొందిరి ఈ హద్దుగల యెల్ల విషయములను మించి ఆయనయందు విశ్రాంతి పొందిననేగాని యెవ్వడును జ్ఞానము తృప్తిపడడు. అజ్ఞానము అన్ని చపలత్వములకుగూడు. ఆశలయందు నచలింపక వృద్ధిపొందును; అది సత్యమునుకనుగొనుటకయి వెదకును; అయితే అది యెచ్చటను యేసత్యమును కనుగొనదు; తక్కిన అన్ని సత్యములును యీసత్యముయొక్క నీడలయి యున్నవి, యీసత్యమును పొందియే, జ్ఞానమందు మనము తృప్తిపడుచున్నాము; అంతట మన అన్ని వాంఛలును తీర్చబడుచున్నవి. పూర్వకాలపు ఋషులు యీ సత్యమునకు పరమాశ్రయమయిన పరమేశ్వరుని పొందినప్పుడు, సత్యము జ్ఞానమనంతం బ్రహ్మ పరమేశ్వరుడు సత్యస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, అనంతస్వరూపుడు, "సత్యమేవాయతనం" ఆయన సత్యము దేహముగాగలవాడు. "సత్యస్య సత్యం" ఆయన సత్యమునకు సత్యము అనిపలికిరి. యీమహావాక్యములకు మన పూర్ణహృదయములతో "తథాస్తు" అనిపలుకుదము; యీ వాక్యములు సర్వదా పఠింపబడి యెల్ల హృదయములయందును ప్రకాశింపజేయబడును. సత్యముయొక్క శక్తియు, ఈశ్వరమతముయొక్క శక్తియు, పూర్వకాలమునందున్నట్లె యిప్పుడు వున్న

ది. ఎల్లకాలమును అట్లే యుండును. లోపములన్నిటిలోను అజ్ఞానాంధకారములలోను, మానవాత్మయందిది ధృవపరచబడును. సత్యమైన నైమయిన శక్తి అసలు కలిగియున్నట్లయినట్టి ఇది ప్రపంచమునంతను క్రమముగా తేజోవంతముగునట్లు చేయును. ఆయన సత్యమయిన మతము అన్నివిషయములను యథార్థముగను నెరవేర్చుము కాలయాపనలేక ప్రపంచము సమాధానమునొందును. ఆనందమునందును ముంచివేయ వలయునని దేవుని ప్రార్థింతుము గాక:



## 10 వ ధర్మోపదేశము.

మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్య ఏషః ప్రవర్తకః. ఆయన మన గొప్పప్రభువు, శాశ్వతపురుషుడు, ధర్మమునందు ప్రవర్తింప జే

ఓ! మన ప్రియతముడయిన దేవుడు ధర్మమునందు ప్రవర్తింప చేయువాడనుట మన కెంత గొప్ప అదృష్టము. ఆయన సత్యమునకును ధర్మమునకును ప్రాణమును ఆధారమై యున్నాడు; ఆయనే సత్యస్వరూపుడుగను సత్యమునకు సత్యముగను ఉన్నాడు. ఆయన సత్యప్రకాశమును అంతటను పంపుచున్నాడు. ఎవరిసత్యమే వుద్దేశ్యముగా గలవారో. ఎవరు సత్యమును ప్రత్యేకముగా గ్రహించినవారై లోకమునకంతకును శోధింతురో, ఎవరు తమ జీవితమును. మానసమును, ఆత్మ

నా. తనకుగల స్నేహమును ఆయనకు ధారపోయుదురో, యెవరు దైవప్రతినిధులే చలింపక యీశ్వరుని కొరకు సత్కార్యముల చేయుచుందురో, అట్టి మహాత్ములను ఆయన అప్పుడప్పుడు పంపుచుండును. ఆయన ధర్మమును ప్రవర్తింపచేయువాడై యున్నాడు. వాడు ఆయన శిష్యుడై యున్నాడు. వాడు ఆయనను అనుసరించువాడు గావున మతబోధకుడై యున్నాడు. ఆయనవలనపంపబడి అజేయమైన నిశ్చయముతో వాడు కష్టములయందును ఆపదలయందు సహితము ఆయనపని నెరవేర్చును ఇంక దేవియందును వారిట్టి యానందమును కనుగొందురు. దేవుడు తనప్రియమైన బిడ్డకు అనేక శోధనలను ఆపదలను కలిగించుటవలన బోధించును. అయితే తనను దానికి ప్రతిఫలముగా సమర్పించుకొనుట వలన వాని యాత్మానందమును వృద్ధిపరచును. ఆనందపూర్ణుడైన ఆయన తనయందు భక్తివిశ్వాసములు గలవారిని సుఖము నందు కొరతపడనివ్వడు. ఆయనశక్తివలన బలపరచబడిన ఆత్మ సమస్తకష్టములను అలంకములను జయించి ఆయన పాదములవద్ద ఆనందస్వరూపమును చెందును ఆయన వానికి బలమును సహాయమును ఇచ్చుచున్నాడు. ఆయన వానికిసత్యదార్థమును ప్రతిఫలమును ఇచ్చుచున్నాడు. పరమేశ్వరుడే ధర్మమార్గమును ప్రదర్శింప జేయువాడైనప్పుడు యథార్థమైనమతము అంతటను బోధింపబడునని యు, లోకములోని జనులందరును సత్యమును అంగీకరించి అవలంబింతురనియు యెవడు సందేహింపగలడు. ఇదంతయు కాలమునకు సమకూరును. ఏతే ప్రతివాదను దీనియందు సహాయ పడవలసియున్నది. ఇట్టి ఘనమైన కార్యమును యెవరు అశ్రద్ధ చేయకూడదు. ఆయన ఘనమైన ఉద్దేశ్యమును యెవరును నిరాకరించజాలకున్నను ఆయ

సర్వోన్నతమైన యిచ్ఛతో మన యిచ్ఛను ఐక్యముచేయుట మన ఘనతమై యున్నది. ఈశ్వరుని అనుగ్రహము లేనిది యేదియు జరుపబడదు. అయితే ఆత్మబలమునందును, హృదయ పూర్వకములైన ప్రయత్నములయందును, మనము కొరతపడి యుండకూడదు; పూర్ణమైన ఆత్మతో ఆయన శాసనముల మనము నెరవేర్పవలయుననియు, ఆయన అనుగ్రహమునకై ప్రార్థింపవలయుననియు ప్రార్థనమూలమున మనవాక్యముల నాలకించునట్టి ఆయన యిచ్ఛ కాదా! ఆయన మన యెదుట ఆవిర్భవించి యున్న ఆ జ్ఞానతేజస్సును సర్వదా అంగీకరింతుము గాక! మన పూర్ణ ప్రయత్నములతో హృదయములోనికి ఆ అనుగ్రహ జలమును గ్రహింతుము గాక! ఆయన అనుగ్రహము మనమీదికి సర్వదాదిగుచున్నది; ఐతే అదే సమయమున మనము శ్రద్ధ ప్రార్థన ప్రేమా విశ్వాసము, ఆశ కలిగియుండవలయును; అప్పుడు మనము దానిని గ్రహించుశక్తి గలిగి యుందుము. జ్ఞానహృదయమును తెరచుటవలన ఆయన సత్స్వభావమును గ్రహింపుము. ఆయన నెవరుచూడగలరు; యెవడు తన ఆత్మను పరిశుద్ధపరచుకొని తన యీశ్వరేచ్ఛకు విధేయుని గలవానిగా చేయువాడే సత్యమును గ్రహించుటకు మనజ్ఞానము నభివృద్ధి పొందింపవలయును; మనజ్ఞానము ప్రకాశించిన కొలదిని ఆయన సత్స్వభావముతో మన మాత్మ ఐక్యమునందధికమగుచున్నది. జ్ఞానము సత్యమునెక్కువగా కలిగియుండినకొలదిని ప్రేమ యంత అధికముగా వ్యాపింపబడుచున్నది; మన యిచ్ఛ ఆయన యిచ్ఛకు విధేయత కలిగినదైనకొలదిని మన మాయన వలన మోక్షమును సమీపింతుము. మనము సత్యముయందును ప్రేమయందును వృద్ధిపొందిన కొలదిని మనమాయనయం దం

త యథికముగా నానందింతుము. మనమానసముల నిశ్చలముచేసి పర
మేశ్వరుని సత్యస్వరూపునిగా నిరీక్షింతుము గాక. ఇది తగినకాలము, ఈ
పరిశుద్ధమైన సమయమును యెప్పుడును నిరాకరింపకుము. అసత్యము నొ
క్కసారి నీహృదయములో భావింపుము. బహుశా మనలో నెవరో
యొకరు రేపు చనిపోవచ్చును. అసత్యమునే మనమొక్కసారి చూడగలి
గినయెడల మనకేమిభయమును లేదు. ఆయన నొక్కసారి మనము చూచి
న తదనంతరము మనము చనిపోయినట్లయిన అక్కడ నేమిభయమున్న
ది; ఎందుచేతనంటే మానవజన్మ ఘనముగానిదిగా చేయబడినది. అయితే
ఆయనను తెలిసికొనకుండ యిచ్చటనుండి మనము తరలిపోయినచో మన
ము నిశ్చయముగా దీనులము. మనమీ సమయమును యంతమాత్రము
ను నిర్లక్ష్యము చేయకుందుము గాక! ఆయనను గ్రహించుట కను
కూలమైన కాలము ప్రాప్తించునప్పుడు నిర్లక్ష్యము చేయకుందుము
గాక. ఆ సత్యస్వరూపుని ఆవిర్భావమును యిప్పుడిచ్చటనే చూడుము.
నీ జ్ఞానమును ప్రజ్వలింపచేసి నీ హృదయమునం దొకసారి గ్రహింపుము.
ఆయన సత్పదార్థమును పరవస్తువును అయియున్నాడు. గ్రహించెడివా
నికైనను ఆయన ఆదిగ్రహీత గౌవనివలన సమస్తవస్తువులును కలుగు
చున్నవో, ఆయనే సత్పదార్థముగ పక్షిలతావృక్షశిలాలోహాది స
మస్తపదార్థములలోను ఆయనే సత్పదార్థమై యున్నాడు. ఆయన
ఆధారములన్నిటికిని ఆధారుడు. సత్యముల కెల్లను సత్యమైనవాడు.
ఇవన్నియు ఆయననుండి కలిగినవనుటవలన జీవము కలుగుచున్నవి. ఈ
చంచలమైన లోకము ఆయన సత్స్వభావమును గ్రహించిన దగుటవల
న ఆ స్థిరత కలిగియున్నవి. ఆయన లోకమునకు గ్రహీతయెట్లో గ్రహీ

తెలకును మూలము. పరమేశ్వరుడు, సత్యమే ఆయన స్వరూపము నీ జ్ఞానమును ప్రజ్వలింప జేయుటవలన అసత్యము నొక్కసారి గ్రహింపుము. ఆయన యొట్టి అద్భుతమైన జ్ఞానవిషయమో యొక్కసారియాలోచింపుము. ఆయన శ్రేష్ఠుడగు జ్ఞానమైయున్నాడు. జీవమే ఆయన అయియున్నాడు ఆయన అంతటను జీవమునలెను, సమస్తమునకును యంతరాత్మవలెను నిండియున్నాడు.

ఆయన సత్యమునకు సత్యము; దేనికంటె సాధురతరమయిన మాటలేదో, దేనికొరకు అంతమంది జనులు తమప్రాణముల అర్పింతురో, సత్యము; ఆయన సత్యమునకు సత్యము; ఆయన పరమసత్యము. “మహాన్ ప్రభుర్వై పురుషః” ఆయన గొప్ప ప్రభువు శాశ్వతపురుషుడు మన యీ మాటలను పలికిన క్షణమే ప్రశ్నమునుం దాయన స్వరూపమెట్లు గ్రహింపబడినది? యీమాటలయందెంత సులభముగ ఆయన జ్ఞానము, ఆయన ఘనమైన యిచ్ఛ, ఆయన పరిశుద్ధమయిన స్వతంత్రస్వభావము, అన్నియు అవిర్భవించుచున్నవి. మన మాయనకు “మహాన్ ప్రభుర్వై పురుషః” యని పిలచినప్పుడెల్లను జీవించుచున్న దేవునిగా మన మాయనను జూతుము. ఆయన పరవస్తువయి యున్నాడు; అంతేకాదు యొక్కవకూడా అయియున్నాడు. ఆయన పరమాత్మ అయి యున్నాడు; అజీవించుచున్న చేతనస్వరూపుడున్ను. స్వాతంత్రస్వభావుడును అయిన ఆయన కేవల వస్తువులయం దావిర్భవింపడు. ఆయన ప్రాణపురుషుడు “చేతనానాం” జీవులకు జీవము “ప్రాణశ్చప్రాణినాం” ప్రాణులకు ప్రాణము. ఆయన స్వభావము పరిశుద్ధమయినది జ్ఞానముక

తో మన సాన్నిధ్యమై యున్నాడు. తల్లియు, తండ్రియు ఆయనే. యేమాటలును ఆయన సంబంధములను తెలుపజాలవు. ఆయన మనతండ్రి, తల్లి, గురువు, సోదరుడు, మిత్రుడు మనకు సమస్తమును ఆయనే అయివున్నాడు. ఆయన మన అంతర్హృదయము, మన ఆత్మలకు ఆత్మ, ఆయన మన అంతర్యామియును. ప్రియతముడును అయిన దేవుడయినందున ఆత్మతో ఆయన సంబంధము జీవమైయున్నది; ఆత్మను స్వతంత్రమయినదానిగా సృజించుట తన సహవాసమునకు అర్హమయిన దానిగా చేసియున్నాడు.

ఆయన పూర్ణపురుషుడు. మనమందరమును చేతనుల మయినందున నే ఆ చేతనసృష్టికి అధికులముగ యున్నారము. తండ్రికిని కుమారునికిని గల సంబంధ స్వభావమువంటిదే ఆయనకును మనకును గల సంబంధమయి వున్నది. ఆయన పరిపూర్ణానందమును మనమును ఆనందస్వభావమును కలిగియున్నాము; ఆయన పరిశుద్ధుడు, పాపసంబంధము లేనివాడు, మనము పరిశుద్ధతను నీతిని కలిగియున్నాము ఆయన స్వతంత్రుడు స్వేచ్ఛగలవాడు మనమును యితరుల నాజ్ఞాపింపగలము ఆయనకును మనకును గల సంబంధము నిశ్చయముగా సన్నిహితమయినది; అయితే యీ సంబంధము ఆత్మ పూర్ణశుద్ధికి వచ్చినప్పుడు మాత్రమే అనుభవింపగలము.

మనమెంత యధికముగ పరిశుద్ధ నీతిస్వభావమును ధర్మమునందు బలమును కలిగియుందుమో అంత యెక్కువగ పాపసంపర్కము లేని ఆయ[illegible]దాని మనము గ్రహింపగలము. మనము జంతువులవలె జీవించుచుం

ను కలిగించుకొందుము; ఆప్రకారము ఆయననుండి అధోగతులమగుదు ము; మనము మనలను అంధులనుగా చేసికొందుము; అప్పుడు మన మాయనను చూడజాలము. కోట్లకొలది జనుల నేత్రములు నాపై నిలిచియుండవచ్చును. నేనే అంధుడనైన ఆకోట్లకొలది జనులయొక్క నాపైదృష్టిని నేను భావింపజాలను. కాని నేను యొంటరిగా నున్నట్లు భావింతును. అయితే భగవంతుని దృష్టితో పోల్చినప్పుడు వేలకొలది మానవుల దృష్టియెంత? సృష్టియందంతటను ప్రతిచోటను వున్నట్టియు, మన ఆత్మల వుత్కృష్టభావములమీద ప్రసరించునట్టియు. ఆదృష్టి యీశ్వరునిదై యున్నది; ఆసర్వవ్యాపకమై పోల్పతగని తేజోవంతమగు దృష్టిని మనము భావింపజాలము. దానిని మనమెట్లు భావింపగలము? అచేతన మెప్పుడైనను చేతనమును భావింపగలదా? చేతనము మాత్రమే చేతనమును భావింపగలదు. అచేతనమువలె జడులమై జ్ఞానపరిపూర్ణుడును, సృష్టికంతకును సాక్షిభూతుడును, జీవమును అయిన అశాశ్వితపురుషుని చూచుటకు అంధులమై యున్నారము; ఆయన తేజము అంతటను ప్రకాశించుచున్నది. అయితే మనము దానిని జూడము. ఆయన ఘనమైన వాక్యము ప్రతిచోటనుండియు బయలువెడలు చున్నది. అయితే మనము దానిని ఆలకింపము. ఆసర్వజ్ఞుడగు పురుషుని యెదుట పాపములను చేయుచు ఒక అల్పమానవునికి భయపడునట్లుగానైనను ఆయనకు భయపడనంత మందబుద్ధులము మనమెట్లగుచున్నాము? ఇది యేమి మన దురదృష్టము. పాపకర్మము. ఓ ఘనమయిన ఆత్మా! యీ దురదృష్టమునుండియు, పాపకర్మమునుండియు నమ్ము తొలంగింపుము. సౌందర్యకారణుడవును, ఆనంద స్వరూపుడవును అయిన నీతో

మాజన్మమును ఐక్యము నొందునట్లు చేయుము, మా మానసము లెట్లు నుపోవక నీవైపునకే తిరుగునుగాక. నీ మూలముననే గాక మాకు వేరు మార్గము లేదు. మాకు నీవు దయచేసిన అఘనమైన వరములను అజ్ఞానముచే నిరాకరించునంత అంధులము మనమెప్పుడును కాకుందుమట్లు చంచలము లేని హృదయములతో నిన్ను ప్రార్థింతుము; నీవు మాకలంకారముగా దయచేసిన యీ మంచిశక్తులు ఎప్పుడును వ్యర్థము కాకుండుగాక; వానిమూలమున మేము నిన్ను మహిమ పఱుతుముగాక; మా దేహము మా మానసము మా శక్తులన్నియు నీవియే కావున నీసేవకు వినియోగింపబడు గాక! అందువలన శాశ్వతత్వమునకు మధురరసమును మనము త్రాగుదుముగాక! నీ అనుగ్రహ ముఖమును అంతకాలమును మా నేత్రములతో వీక్షించుచుండగా మన జన్మము అంతము నొందుగాక. నిన్ను ఆరాధించుటకీ దినమున మేమందరమును కలసి యున్నాము. సూర్యుడు త్వరగా అస్తమించవలెననియు నీ కాంతిగల కరుణాముఖమును జూచుటవలన ధన్యత్వము నొందవలెననియు, దినమంతయు ఆశగలిగి యుంటిమి. ఆకాలము యిప్పుడు వచ్చినది. ఒకసారి మా హృదయములయందు దర్శించుటవలన మా ఆశను పూర్తిపరుపుము. నీవు మా తండ్రివి, తల్లివి, హితుడవు, స్నేహితుడవు. చెలికాడవు, రక్షకుడవు, ఆనందకారణుడవు, మోక్షదాతవు మేమందరమును నీయందు శరణుజొత్తుము; మేము సమస్తమును నీహస్తమునందర్పింతుము; నీవు మమ్ము కాపాడుము. ప్రాపంచిక విషయములలో దినమంతయు వుదయము మొదలు సాయంత్రము వరకును ప్రవర్తించుచుండిన వృత్తికిని మా మానసము లిప్పుడెట్లు వున్నతస్థితికి వచ్చినవి? నీశాశ్వ

తత్వస్వభావము మామీఁది కెట్లుగా వచ్చుచున్నది: అది యెచ్చటనుండి యెట్లుగా మమ్ము తెలివొందజేయుచున్నదో మేమెఱుగము. ఓ, ఐశ్వర్యము! ఎట్టిఅద్భుతము! నీసహవాసానందము ననుభవించినవాడు యెచ్చటను దాని సామ్యమును కనుగొనడు; వారి నేత్రములు నీమీఁదమాత్రమే నిలచియున్నవి. వాని నాలుక నీ స్తోత్రమును పాడుటకు ఆశకలిగియున్నది. మేము నీతో నివసించునప్పుడు క్షుద్రమైన ధనము మర్యాద కీర్తియందలి యిచ్ఛ మామానసము నాక్రమింపగలదా? సూర్యకిరణముల మధ్యమున నివసించుచు యెవడయినను మెఱుగుడు పురుగు కాంతిని ఆశించునా? అట్లే నిన్ను పొందుటకై వున్నతస్థితికివచ్చి నీయందానందించునప్పుడు ప్రాపంచిక వాంఛలును అల్పతలంపులును యింక నుండవు. ఎల్లకాలమును పరిశుద్ధమతానందము నెట్లు సంభవింపవచ్చుననియు, నీశాశ్వతత్వముతో సర్వదా యెట్లు నివసింపవచ్చునను నియు అప్పుడు ఆత్మకు బలమయిన ఆశయగును. అప్పుడు దేవతలవలె నిన్ను ఆరాధించుటకు స్వతంత్రము గలవారమని మేము తెలిసికొనినప్పుడు మేమెట్టి ఘనతను పొందుదుము! ఓ పరమాత్మా మా హృదయములో యీ పవుస్నతన్నభావమును ప్రవేశపెట్టుము. నీవద్దకు వచ్చునప్పుడెన్నడును రిక్తహస్తములతో వెడలి పోకుందుముగాక! మాయందు కరుణయుంచుము. యీప్రార్థనామందిరమున యిచ్చట మేము దేనికైతే. చేరియున్నామో అట్టి నీపరిశుద్ధ ఆస్తికత్వమును మేము అనుభవించులాగున దయచేయుము, ఈపరిశుద్ధమయిన ప్రార్థనామందిరమున ఆయన తేజోవంతమయిన స్వభావమును ఒక్కసారి జూచినవారు ఆఘనమయిన పండుగదినము యెప్పుడువచ్చునాయని వారమంతయు నిరీక్షిం

ధర్మలక్షణము; ఒక నియమితోద్దేశ్యమునకు ప్రయోగించుట పురుషలక్షణము. యీశ్వరుని పరమాత్మయని గమనింపజాలనివారు సృష్టినిగూర్చి ఆలోచించునప్పుడు అనేక లోపములలో చిక్కుపడెదరు. సృష్టికి అతీతమగు శక్తిని గమనింపజాలక వారి వూహాలన్నియు సృష్టినుండియే గ్రహింతురు విత్తనములనుండి వృక్షములు పెరుగులాగున ఈశ్వరునినుండి ప్రపంచము వ్యాప్తమయినదని వారు చెప్పుదురు. అయిన సృష్టిని విధిలేక చేసెనని కొందరందురు; కొద్ది సంఖ్యాకులుకాని వారు ఈశ్వరుని సృష్టితో ఐక్యము చేయుదురు అనేకులు ఈసృష్టి కారణము జడశక్తియేయని తలంతురు. అయితే బ్రాహ్మమతము (పరిశుద్ధాస్తికమతము) కేవలము వేరువిధముగా బోధించుచున్నది. ఒక జడశక్తి సృష్టికి ఆదికారణమని అది చెప్పదు; అయితే ఒకే వుత్కృష్టపురుషునియిచ్ఛ దీనికి మూలాధారమయినట్లు అది గమనించును. జ్ఞానము, నియమించునట్టియు ఆనందస్వరూపమయినట్టియు స్వభావము అన్నియు ఆయన యిచ్ఛతో సంబంధించియున్నవి. అనంతశక్తి, ఆ వుత్కృష్టపురుషుడు, ఆజీవముగల దేవుడు వుత్కృష్టకారణమయి యున్నాడు. ఆయిన తన కరుణవలన స్వతంత్రముగా యీసృష్టిని కలిగించెనేగాని విధిలేక ఆయన దీనిని కలిగించి యుండలేదు; ఆయనయిచ్ఛచేసమస్తమునుసృజించెను. ఆయన యింక మరియొకనివలనను ప్రేరేపింపబడలేదు; అయితే ఆయన తనజ్ఞానశక్తుల నయిజప్రవర్తనమువలన సమస్తమును సృజించెను. ఆయన కరుణాపూరితములయిన యిన్నిమార్గములను ఆయన ఆలోచించి యేర్పరచెను; అన్నియు ఆయన త్రియశాసనములవలన నియమిం

పలుకుచున్నవి; ఆయన ప్రియరాజ్యమును అన్నియు వెళ్ళడింపుచున్నవి కరుణాపూర్ణుడును, ఆనందపరిపూర్ణుడును ఆయన అయినట్లుగానే లోకమును ఆయన కారుణ్యముచేతను ఆనందామృతముచేతను పూరించెను. ఈ అద్భుతమైన లోకమును కేవల అద్భుతుడయిన ఈశ్వరునివలననయి నది. అభివృద్ధి దాని జీవము భూమి ఆకారమునందు సౌందర్యముగలదు అభివృద్ధి గలదు; జ్ఞానమునందును మతిమునందును అభివృద్ధి గలదు; కరుణచే వెదచల్లబడినది. అశాశ్వతుడయిన పురాణపురుషుడు సర్వదా యోకేపథమున నున్నాడు. తక్కినవాటినన్నిటిని అభివృద్ధినందునట్లు ఆ యన నియమించినాడు. ఆయనసృష్టిలో ప్రాతదేదియు నిలువజాలదు; ప్రతిది నూతనత్వమును లావణ్యమును పొందును మనము దేనినయిన ను శ్రద్ధతో నిర్మించినప్పుడు దానిని విడుటకు మనమెంత యిష్టములేని వారుగానుందుము; అయితే యింత సౌందర్యప్రదమైన ఆయన రాజ్య ములో వృక్షములు ప్రతివత్సరము ప్రాతయాకులను రాల్చి నూతన ప ర్ణములను దాల్చును; నెమళ్లు అంతప్రకాశమానమైనట్టియు సౌంద ర్యమును కలిగినట్టియు తమ పింఛములను విడచును. మరియు నూతన పింఛము లమర్చబడును. ఆ ఆనందస్వరూపుని లోకములో ప్రతిదియు నూతనముగాను, సౌందర్యముగాను పెరిగి వృద్ధినొందుచుండును. భౌతిక ప్రపంచముకంటెను ఆత్మను యెక్కువ అభివృద్ధికలదానిగా ఆయన చేసె ను. ఆయన దానిని ప్రాపంచిక విషయములతోడను ప్రాపంచిక సౌఖ్య ములతోడను తృప్తినొందకుండుదానిగా చేసెను. ఆయన దానిని నిరం తరము తనకె ఆకర్షించుకొనుచున్నాడు.

ఆయన తనజ్ఞానమును, ధర్మమును అంతకంత కధికముగా బయల్పర్చుచున్నాడు. వృద్ధి ఆత్మస్వభావమయి యున్నది; వృద్ధి ఆత్మోజ్జీవమయి యున్నది. ఆత్మలయందాయన యుంచిన ఆమొగ్గలు యిచ్చట పూర్ణముగా వికసించవు లేక వాడియుపోవు. ఆమొగ్గలు ఒకదాని తర్వాతనొకటిగాన్వర్గ ప్రదేశములలోనివసింపుచు వికసింపుచుండును. దానిజ్ఞానమును, ప్రేమయు, ఆనందమును అంత్యమునుయిచ్చటకలిగియుండవు. యీశ్వరుని ఉత్కృష్టమయిన పరిశుద్ధానందమునుఅనుభవించుటవలనమనము తృప్తినొందినప్పటికిని ఆయన మనకిచ్చెడి వర ప్రసాదమునందు ఆయన యొప్పుడును తృప్తినొందడు. ఆనందము తర్వాత మరియొక ఆనందములో మనము ముంపబడి అంతకంతకు వృద్ధినొందు చుండగా, నీవింకను వృద్ధినొందవలసియున్నదని ఆయన చెప్పుచున్నాడు. యిట్లు వృద్ధినొందెడి ఆత్మను ఆయనకై సర్వదా ఆకర్షించుకొను చున్నాడు. శాశ్వతత్వమునకు వారసులమగులాగున బలముతోడను శక్తులతోడను ఆయన ఆత్మను సృజించెను ఆయన స్వతంత్రుడయినట్లు ఆత్మకు వివక్షతా స్వాతంత్రియమును యిచ్ఛా స్వాతంత్రియమును దయచేసెను; సృష్టినంతను ఆయన అచలచలమగు శాసనముచే బంధించెను; మానవస్వభావమునకు మాత్రమే దానిని మీరుటకు శక్తినిచ్చెను. హిమశీతలమున నుదకము ఘనీభవించులాగున సృష్టియంతయు శాసనబద్ధమయి యున్నది; అయితే మంచుచలిచే గడ్డకట్టిన నీరు సూర్యకిరణ ప్రసారము వలన ప్రవాహముగా వెలువడి భూమిని పదునుచేసి సారవంతమును ఫలవంతమునయినదానిగా చేయును. అది యేవిధమున ఆత్మ ఆయన శాశ్వతత్వ తేజసంపర్కమువలన ఆయన కారుణ్యమును విచ్చల విడిగా అంతట

ను ప్రకాశింపజేయుచున్నది. అనదివలెనే అదిఆటంకమునులక్ష్యపెట్టదు కాని యెల్ల ప్రదేశములను దాని పరిశుద్ధోదకముచే నింపుచు యెప్పుడును యిచ్ఛా స్వాతంత్రియమును పోగొట్టుకొనక చివరకు శాశ్వతత్వమహాసముద్రమున నిర్గమించును. ఈశ్వరుడు సృష్టినంతను స్వాభావిక శాసనములకు లోబడునట్లుచేసి ఆత్మయందు తన స్వరూపమును యేర్పర్చెను. ఆయన ఆత్మకు మతనీమములను దయచేసెను. ఈశాసనమునందు విధిలేదు. కాని సమస్తమును స్వేచ్ఛయయి యున్నది. మానవుడు జంతు తత్వము కలిగియున్నంతవరకును విషయాశక్తిలేని జంతుస్వభావమునకును లోబడువంతవరకును, బహుతిక ప్రపంచమునకు లోబడి యున్నాడు. బహుతిక ప్రపంచము నాధారముగా కలిగియున్నమట్టుకు వాడు బహుతికమయి యున్నాడు. తన స్వస్వాతంత్రియమును నాధారపరచుకొని ప్రవర్తింప గలిగినంతవరకును వాడు పురుషుడయి యున్నాడు. యీదేహము నాది, కాని నేను కాదు. నేను ఆత్మజ్ఞానముగల పురుషుడను, యితరేంద్రియములు నాసేవను జేయుచున్నవి. పురుషస్వభావము యేస్వభావముచేత ధరింపబడి వ్యాప్తమయినదో అట్టిదాని నియమింపగలిగినట్టి నా స్వతంత్ర శక్తియై యున్నది. బంధము సృష్టియందు మాత్రమే కనుగొనబడుచున్నది. ఆద్యంతమును లేనట్టి అనుల్లఘ్యముగు కార్యకారణ బంధము నేను చూచుచున్నాను; అయితే సృష్టియందు స్వేచ్ఛ స్వతంత్రమువంటి దేదియు కనుగొనబడదు. సృష్టి అంధమయినట్లు ప్రవర్తించును. మరియు యీశ్వరుని ఘనోద్దేశములను జ్ఞానహీనముగా నిర్వహించును; సృష్టి మరణ చిహ్నమేయయి యున్నది. శాశ్వతమయినట్టియు జ్ఞానప్రద మయినట్టియు స్వతంత్ర మయినట్టి

రయు కొంచెయు దానికి లేదు. సృష్టి యతీతమగు శక్తులను దయచేయుటవలన ఆయన వానిని తన సన్నిధానమున కాపాడించుకొనుచున్నాడు. మానవుడు ప్రకృతి శాస్త్రములవలన సృష్టి నతిక్రమించుచున్నాడు. అస్వాతంత్ర్యమయిన కార్యకారణ బంధముచే తాను ఒక్కడుమాత్రమె బంధింపబడలేదని తనలో తాను తెలిసికొనును; వాడు తన స్వశక్తులవలన దాని నతిక్రమించును; తాను విధిగా అవలంబింపవలసిన నీతినియములను తనలో తాను చూచును; అనేకములయిన విమర్శనామూలములనుంచి ధర్మశాసనముల విధిగా నవలంబింపవలయుననెడి స్వాతంత్రియమును తనలో తాను చూచును. యీశ్వరుడు యీ స్వాతంత్రియ భూషణమును మానవునకు దయచేసెను ఆయన వానికి శత్రునిశక్తుల నేర్పరచెను వానిని బలపరచుటకే ఆయన ఆశీస్సు నేర్పరచెను ఆయన ఆత్మను అపాయములను కష్టములను దాటుకొని తుదకాయన పాదములవిూద వాలునట్లు అతి బలమయినదానిగా చేసెను. కావున యీశ్వరునితో యెట్టిజీవముగల సంబంధమును గలిగియున్నామో గుర్తింపుము.

ఆయన "మహా ప్రభుర్వై పురుషః" అయివున్నాడు.

గొప్పప్రభువును మహాత్తయిన పురుషుడును నయిన ఆయన తన స్వభావము ననుసరించి మానవుని చేసెను. ఒకపురుషునికిని మరియొకనికిని, కుమారునకును తండ్రికిని గల సంబంధమువంటి సంబంధమే మానవుడు యీశ్వరుని యెడల కలిగియున్నాడు. ఆయన ప్రేమాదృష్టి మనమీదనున్నది. మనము ప్రేమతోడను కృతజ్ఞతతోడను ఆయన వం

క చూచుచున్నాము. మనము ధర్మస్వరూప రాజ్యమునొక్క ఆ రాజునకు ప్రజలము. ఆయన పరిశుద్ధ న్యాయ శాసనములు మన యెదుట నున్నవి. మన యిష్టానుసారము వాని ననుసరించుటకు స్వతంత్రుల మయియున్నాము; కావున యీశ్వరునకును మనకునుగల సంబంధము ఒకపురుషునకును మరియొకనికినిగల సంబంధమువంటిది. ఈసత్యము క్రైస్తవమత (పరిశుద్ధాస్తికమత) సారమయి యున్నది. మన దినదినపాపకార్యముల నిమిత్తమును మన కష్టముల విముక్తికొరకును, మన పాపవిమోచనకొరకును ఆశాశ్వత పురుషునివంక చూతుము. ఆయన మన తండ్రివంటివాడు, మన మాయన బిడ్డలము. ఓ శాశ్వత పుత్రులారా ఆయనను పూజింపుడి. అందరును కలసి ఆయన ఆశ్రయముకు కోరి పరిశుద్ధమయిన నిష్కల్మష హృదయములతో ఆయన అనుగ్రహమునకయి అడుగుడి.

ఈశ్వరుడు ఆత్మలన్నిటిని తనవయిపున కాకర్షించుకొనుచున్నాడు. ప్రీతి హృదయమునందును దివ్యస్వభావపు మొగ్గలను ఆయనవుంచియున్నాడు; కావున అవి వికసించుకొరకు మహాత్ముల నప్పుడప్పుడు పంపుచుండును. ఆయన ఆనందస్వరూపమును అనుసరించు ఆయన ప్రియపుత్రులు ఋషించునంతవరకు ప్రేమను బోధింతురు. దివ్య పుష్పముల విత్తనములు ఆత్మలన్నిటియందును కలవు. కాని అవి ఆయన ప్రియభక్తుల బోధలవలనను ప్రవర్తనమువలనను వికసించును. ఈవిధముగా నభివృద్ధిచెందినవారు తనకంటె తక్కువగువారిని తన సామ్రాజ్యమునకాకర్షించుకొనుచున్నారు. ఈపరిశుద్ధ పురుషులకెంత ఆశ్చర్యకరమయినస్వభావము! యీశ్వరుని ప్రియభక్తులు మనకు ప్రియతమమై ఘనమై ఆ

కమనీయమయిన ఆనందస్వరూపము ననుసరించి సమస్త కష్టములను ఆపదలను తా మనుభవించి యీశ్వరుని ఆనంద స్వరూపమును బోధించుచుండెను. వారి నిర్లోకమునకు బంధుటవలన ఆయన వేలకోటిజనుల తనకొరకయి ఆకర్షించుకొనును; అనేకుల క్షేమము కొరకు ఆయన తన ప్రియపుత్రుల విదితకష్టముల పాల్పర్చును. వారు వాటిని యిష్ట పూర్వకముగా గ్రహింతురు; వాటిమూలమున వారు అభివృద్ధినొందుచున్నారు. ఆయనకు మనయందుగల అనుగ్రహ మెంత అప్రతిహతమయినది.

ఓపరమాత్మా, మా దేశమును నీవభివృద్ధి పొందించెదవా, నీకారుణ్య నేత్రములతో నీపుత్రుల పుత్రుల చూడుము. ఈ దౌర్భాగ్యమైనట్టియు, అణగొట్టబడినట్టియు దేశమునకు నీకంటె హితుడెవడునులేడు. ప్రతిదినమును అంతకంతకు వివిధ ఆపదలలోను దుఃఖములలోనుత గులుకొనుచున్నది. దివారాత్రములు దాని దుఃఖస్వరము వినబడుచున్నది. ఓపరమాత్మా, ధర్మమును ప్రసాదించుటవలన నీవీదేశమునురక్షించెదవా; దాని దుఃఖములను తీర్చెదవా? ప్రతి హృదయ మందును నీ ప్రేమా బిందువులను వర్షింపుము. మాతండ్రివలెను మా తల్లివలెను నిన్ను నీవుబయల్పర్చుకొనుమా, మేమందరమును నిన్ను పూజించులాగున అనుగ్రహింపుమా. ఓహో! మా దేశపుత్రులందరును యేకహృదయముతో నిన్ను ఆరాధించునట్టి కాలమెప్పుడువచ్చును. మా క్షుద్ర ప్రయత్నములేమియు ప్రయోజనములేదు. కావున సమస్తమును నిర్వహించిన నీవు నీ అనుగ్రహమును ప్రసాదింపుము.



## 13 వ ధర్మోపదేశము.

“ఇదంవా అగ్రేనైవ కించదాసీత్ । సదేవ సౌమ్యేద మగ్రాసీత్ ఏకమేవాద్వితీయం సదా ఏకమహానజఆత్మా”

ఆదియందు యీసృష్టి యేర్పడి యుండలేదు. ఆరంభమున రెండుగాక యొక్కటేఅయి జనన రహితమయిన పరమాత్మ యుండెను.

ఈసుందరమయిన సృష్టి ఆదియందు వుండియుండలేదు. అవకాశమునంతను నొక్కొక్కటిగా చీకటికమ్మి వేసెను “తమఆసీత్ తమసా గూఢమగ్రే” అంధకారము క్రమ్మెను ఆచీకటికి పరికాశము రెండుగాక ఒకటేఅయి సత్తామాత్రుడుగానున్న పరమాత్మయే. అంధకారము తప్ప వెలుతురు లేనప్పుడు ఆజ్ఞానజ్యోతియైన పరమాత్మ ఆనందమగ్నుడయియుండెను, సర్వతేజములును ఆరిపోయినను, సూర్యుడు యెప్పటికిని అస్తమించినను నక్షత్రములు యెప్పటికిని ఒక్కమాటుగా మరుగయి పోయినను ఆతేజస్వియయిన పరమాత్మ అప్పుడు సహితము వుండును. సృష్టికిపూర్వము సహితము ఆయన తనయందు తాను ఆవిర్భవించెను. ఆయన యిప్పుడు సర్వసృష్టికిని కారణమాత్రుడయి యున్నాడు; కాలక్రమమయిన యీసమస్త సృష్టియు నశించిపోయినను ఆయన యింకను శాశ్వతకాలమునకు వుండును. “ఈశానో భూతభవిష్యస ఎవాత్ యుక ఉశ్వ” గత ప్రస్తుతకాలముల కాయన నాయకుడు. భవిష్యత్ కాలమునకువలెనే ఆయన యిప్పుడును సముడయి యున్నాడు. ఆయన ఒక్కటే ఉనికిని కలిగియున్నాడు. ఆయన రెండు భుజములమీదను భూతభవిష్యత్ కార్యములు నియమింపబడుచున్నవి. ఆయన స్థలకాలాతీతుడు

గల సూర్యు డెచ్చటినుండివచ్చెనో? చుట్టును పరిశీలనచేయుటకు ఆది అసంఖ్యాకములగు కిరణములు నెందుండి గ్రహించినది! యిది ఆయాదికారణుడయిన పరమాత్మ యిచ్ఛనుండి కలిగినది. ఆయన యిచ్ఛచే యీమన సుందరమయిన పరిశోధనముల భూమి సూర్యుని చుట్టును ఆకాశమును తిరుగుట కారంభించెను. ఆహా! ఆలోకము అప్పుడు దేనిబిడతృణవనములన కలిగింపబడినదో యెరుగదు తగులబడుచున్న కర్రవలె వేడిగలదియు కరుగుచున్న లోహములతో నిండినదియు, ఆవిరితోడను మేఘములతోడను ఆవరించుకొనినదియు నయిన ఆభూమి సౌందర్యమునకును కాంతియందును అద్భుతముగా నలంకరింపబడి అసంఖ్యాకములగు వృక్ష జంతుజాలములతో నిండుకొనని అప్పుడు యెవరు భరింపయుంచియుండును? దానియందట్టి విత్తనముల నెవరు వెదజల్లిరి? ధనధాన్యములకును ఫలపుష్పములకును ఆకరమగునట్లు చేసి దీని నెవరుత్పాదించిరి? సూర్యు డెచ్చటనుండి అనేకముక్కలనుండి యీజంతువులను వృక్షములను యెచ్చటనుండి? నేడును సూర్యునినుండి బయలుదేరి భూమిని ప్రకాశింపజేయుచున్నది! దానితో జీవ ప్రవాహముపారుచున్నది. మన అంతరాత్మలు తొలగింపబడుచున్నది యీవిధముగా సంబంధము నెవరు యేర్పరచిరి? యిది జడత్వమునకు సాధ్యమా? యీజీవమును యీద్రవ్యమును, యీనిరుపమాన సౌఖ్యమును, యివన్నియు నొక జడతత్వము నుండియే ప్రవహించినవా? లేక జ్ఞానమునందును ధర్మమునందును పూర్ణుడయిన యొకప్రభువునుండి యివన్నియు యిట్లయినవా? యీలోకము నొక్క కరుగుచున్న లోహముల ముద్ద యయినప్పుడు, పొగచేతను ఆవిరిచేతను మేఘములచేతను కప్పబడిన ఆభాగము

వంక నెపరయిన చూచి యిట్టి సౌఖ్యప్రదమైన రాజ్యముగునని భ్రమిం
చి యుందురా? అయితే యీశ్వరుడు తన భవిష్యత్ చింతనమువందు
ఆ అనావృత్తమై యుండుచున్న భూమి యిట్లు నివాసయోగ్యమై వుద్యాన
వనములగునట్లుగ దాని యందట్టి అద్భుతశక్తులనుంచెను; అది కాలక్ర
మమున చల్లార్పబడి అసంఖ్యాకములగు జీవులయొక్కయు, అంతములే
ని సౌఖ్యముయొక్కయు గృహమయ్యెను. ఆవిరి ఘనీభవించి జల్లని
జల్లు వానలను కురిసెను; అసంఖ్యాకములగు చేపలను, మొసళ్ళను కో
ట్లకొలది జలచరములును నీటియందు యీదనారంభించెను. కాలక్రమ
మున నీటియడుగునుండి సూర్యునివైపు పర్వతములు బయలుదేరి యీ
శ్వరుని మహిమపరచుట కారంభించెను. భూమి స్థల ప్రదేశముగను
జలప్రదేశముగను విభాగమయ్యెను. వృక్షములును, అన్నివిధములగు
జంతువులు వానిలో వృద్ధినొందెను. యివియంతయు దానియంతట నది
యే కలిగినదా? యిది జడశక్తి పనియా? కాదు; యిది అజ్ఞాన స్వరూ
పుడయిన పరమపురుషుని మహిమవ్యక్తమగుచున్నది. యింత అద్భుతమైన
విధముగా యీసృష్టి రచనచేసిన దాయనయే. ఆహారమును నమలుట
కు మనకాయన దంతములను దయచేసెను, దంతములను దయచేయక
పూర్వము మాత్రము స్తనములయందాయన పాలనుంచెను; ఓహో!
యెంత అద్భుతమయిన యేర్పాటు! ఆయన నిరీక్షణశక్తి యెంత అద్భు
తమయినది! యివన్నియు జడశక్తిపనియా? అదియొక పురుషుని జ్ఞాన
మును సూచింపదా? అది ఒక్క ఆత్మయొక్క ప్రీతిని కనుపరుపదా?
అది యొకపురుషుని యిచ్ఛను ఆలోచనను చూపింపదా? యీ శ్రేష్ఠ
యుతతత్వతో మనల కాపాడునారెవరు? మన వ్యాధులకుదురుటకు యే

దయామయుడు అన్ని విధములయిన మందులను సృజించెను. మన దే
హమందలి యేఅవయవమయినను బాధనొందునప్పుడు మననిశాసనము
ననుసరించి పూర్వమువలె నది నెమ్మదియు బలమును గలదగును. ఆత్మ
అంధకారావృతము పాపపరివృతమయినప్పుడు యెవరు పరితాపమును
కలిగించి దానిత్రిప్పుచున్నారు? శాశ్వతకాలము మనమే తల్లియు దండ్రి
యునయియున్నాడో యెవనియెడ తెగనిప్రేమ మనల ధర్మమార్గము
నందు కాపాడుచున్నదో ఆయనయే యిదియంతయు చేయుచున్నాడు.
మనకు భయమేమి; మనకు కొరతయేమి! భవుతిక ప్రపంచమునకాయ
న ప్రభువయినట్లు ఆత్మకును ఆయన అయివున్నాడు. సృష్టికి ఆయనదే
వుడయినట్లు నాకు దేవుడయివున్నాడు. ఆయన అనుగ్రహమును పొంది
మన దినములు గడుపుచున్నాము. జీవితము సుఖసంతోషములన్నియు
ఆయనవలన కలిగినవే; దానికొరకు మన కృతజ్ఞతాహృదయము నాయ
న కర్పించునప్పుడు ఆసౌఖ్యమెంతపరిశుద్ధమును ఆనందదాయకమునునై
యున్నది. వృద్ధి ఆయన ప్రియముఖమును మనకు కనబరచును. క్షీణము
వుపాధ్యాయునివలె బోధించి ఆయనవయిపునకు మనల నాకర్షించును
అంతట అక్షీణతే మనమే పరమఅభివృద్ధి సృష్టియంతటను ఆయనప్రేమ
కలదు. సర్వదా మనమాయన కరుణ నాశ్రయించి యున్నాము. మన
మీలోకములో నుండెడి కొలదిరోజులకు ఆ ఆనందస్వభావము సాధార
పరుచుకొనుట కంటెబలము మనయొద్ద లేదా? శాశ్వతకాల మవనితో
కలిగియుండవలసిన ఆయన ప్రేమాశ్రయమున యీకొలదికాలము కష్ట
ములలోను ఆపదలలోను నిరాశజెందని హృదయముతో జీవించుటకును
నకంతె యాధారము లేదా? యీస్వల్పకాలమునకు పూర్ణ విశ్వాసము

తో ఆయన ప్రేమను నమ్ముకొనియుండజాలనిచో శాశ్వత కాలమునకు మనకేమి యాశకలదు? ప్రాపంచకసౌఖ్యలేశమునకయి మనము గర్వించవలయునా, దుఃఖలేశమునకయి మనము నిరాశజెందవలయునా? క్షణికసుఖములకయి మనము మనోవికలులమగుట యీశ్వర యిచ్ఛ కాదు ధర్మబలమున బలపర్చబడుటకును కష్టసుఖములయందు నిశ్చలులమయి యుండుటకును ఆయన యిచ్ఛయించును. భౌతిక ప్రపంచము నాయన స్వభావిక శాసనబద్ధముచేసినట్లు ఆత్మను మతనీమమునిచ్చుటవలన ఆయన బంధించెను. మనము బోధింపబడవలయుననియు బలపర్చబడ వలయుననియు, నీతి జ్ఞానాభివృద్ధి నొందవలయుననియు, ఆయనయుద్దేశము దాని పరిసమాప్తికొరకు అనేకమార్గముల నాయన యేర్పర్చెను. దానికి ఆయనయే సహాయముచేయుచున్నాడు. వృద్ధిక్షయములు వసంత శీతకాలములవలె మారిపోవును. అయితే నీతి స్వరూపుని స్నేహితునిగా చేసికొనిన యీశ్వరుని మన మాధార పర్చుకొనిన ఆత్మశక్తి యెప్పుడును తగ్గిపోదు. దాని సంతుష్టియెప్పుడును నాశనము చేయబడదు. ఓపరమాత్మా, ఆత్మశాంతిని కాపాడుము; అంతటను నీ అనుగ్రహమును వ్యాపింపచేయుమా! నీమార్గమున బ్రాహ్మసోదర సంఘమును (పరిశుద్ధాస్తిక సోదరసంఘమును ) వృద్ధినొందింపుమా! విశా జ్ఞానముచేత యీ దేశమును ప్రకాశింపజేయుమా; శాంతోదకంబులనీప్రపంచమును ముంచుమా; అందరను నీసేవయందు వినియోగింపుమా;

## 14 వ ధర్మోపదేశము.

"యదాతద్యతోర్థానవ్యదధాచ్ఛాశ్వతీభ్యస్సమాభ్యః"

"లోకములలో నివసించు శాశ్వతజీవుల కర్మఫలములను ఆయన స్థిరపరచెను".

ఈ సృష్టిసారమును ప్రేమయు స్వరూపముగాగల ఆదేవునిది. అది ధర్మపరిపూర్ణుడయిన ఆయన ధర్మముతో నిండి యున్నది. ఆనంద పూర్ణుడయిన ఆఒక్కని ఆనందకిరణములచే అది చుట్టును ప్రకాశించు చున్నది సుందరమయినట్టియు సౌభాగ్యమయినట్టియు వస్తువులన్నియు ఆయనవలన కలిగినవి. దానిసమస్తమును ప్రతివస్తువయు ఆయనవలన కలిగినది. యీలోకమునింత సౌందర్య తేజ పరిపూర్ణముగను. సౌఖ్య ప్రాణిసమన్వితముగను చేసిన దాయనయే. మానవుని సృజించి సృష్టిను నతను పూర్తిపరచెను. ప్రేమను, సౌఖ్యమును, ఆనందమును ప్రసాదించుటయే ఆయన సృష్టిపుద్దేశ్యము. ఆయన ఆనంద స్వభావమును అనుసరించి హృదయగర్భితముచేసికొని అంతటను వ్యాప్తముచేయు కొరకు ఆయన మహాత్ములను సృజించెను. మన పరిశుద్ధతయంతయు ఆయన ధర్మస్వరూప ప్రతిబింబముమాత్రమే అయియున్నది. మహాత్ముల లక్షణ మేమి? యిది వారంతట వారనుభవించెడి ఆనందమును యితరులనుభ వించునట్లు చేయునంతవరకును వారెప్పుడును తృప్తి నొందరు. బీదలకును అనాథలకును, తమఆహారపానీయముల పంచియున్నట్లున్న వారిమ్మానసమెప్పుడును సుఖపడదు; వారివారిహక్కులను తన సత్యము సేదయిన

ను వారు కనుగొనిన తక్షణమే లోకమునకు బోధింపుచుండును. తాము మాత్రమే బ్రహ్మానందము ననుభవించుచుండిన వారుతృప్తినొందియుం దగలరా? వారాటంకమును లక్ష్యపెట్టరు, యెప్పుడును మనుష్యులకు భయపడరు. సాత్వికానందమును బ్రహ్మానందమును వేలకొలది జనులపై వశీకరింపజేయునిమిత్తము తమ క్షుద్రశరీరముల అర్పించుటకెప్పుడును వెనుదీయరు. యేల మహాత్ముని లక్షణమీవిధముగా నున్నది? వానిమహాత్యము ఆ ఆనందస్వరూపుడయిన దేవునివలన కావుననే యీపరిశుద్ధత తర్వాత యీశ్వరుని వద్దులేసి కారుణ్యమునుగూర్చి యోచింపుము. తనంతట తానుభవించుచుండిన ఆ ఆనందమును వ్యాపింప జేయుటయే సృష్టియుద్దేశ్యమనియు, యీ జంతుజాలమునంతయు సృజించుట వానిలో ప్రేమను వెదజల్లుట కనియు, కనుపడుటలేదా? అసంఖ్యాకములగు ఆత్మలను దయాధర్మములవలన గలుగు ఆనందముచే సింపింపదా? వృత్తమజీవులు నీతియందభివృద్ధినొందుటయు, అంత కంతకు క్రమముగా పరిశుద్ధములగుటయు అట్లు తన సింహాసనమును సమీపించుటయు ఆయన సృష్టియొక్క ముఖ్యోద్దేశమయి యున్నది. దీనికొరకే ఆయన ఆత్మను సృజించెను. దీనికొరకే ఆయన దేహమును దాని నివాసస్థలముగా నేర్పరిచెను. దీనికొరకుమాత్రమే సృష్టినంతయు ఆయనచేసెను. ఒకదానికొకటి అతిదూరముననున్న యీ అనంతగోళములు ఆయన వృత్తముజీవుల సాధనాస్థలములను ఆయన శాశ్వత పుత్రుల నివాసస్థానములును అయివున్నది యీఘనమయిన అనుగ్రహమునుపొందింపని ఆజీవులను సమస్త సౌఖ్యములనుండియు ఆయన పూర్ణముగా తొలగించివేసెనా; లేదు; వానికిసహా సౌఖ్యమును ఆనందమును వి

చ్ఛలవిడిగా వెదజల్లెను వృద్ధినొందుచున్న ఆయన ఆనందప్రవాహములు అంతటను పారుచున్నవి. ఒకనీటిబిందువును పరీక్షింపుము? అదియెట్లు అసంఖ్యాకములగు జీవులతో నిండినదియు, మితిలేని సౌఖ్యముతో పూర్ణమయినదియు నయియున్నది. అడవిలో ప్రవేశింపుము. ఎట్లు జంతువుల మందలు చెట్లనీడను పండుకొనుచున్నవో యెట్లు పూర్ణమయిన తృప్తితో నెమరువేయుచున్నవో పక్షులెట్లు తమ మనోహర స్వరముల చేతను ఆనందములను తెలుపుచున్నవో యెట్లు వర్షకాలపు ఆరంభ జల్లులచే జంతువుల వలె వృక్షములు సంతసమును కనుపర్చుచున్నవో చూడుము. అయితే యీ అద్భుతసృష్టి వెలువడినది యానోగులేని జంతువులకొరకును చలనము లేని వృక్షములకును కాదు; జ్ఞానసౌందర్యముల కాకరమగు యీ నిరుపమానసృష్టి యీ నోరులేని జంతువులయొక్క సొత్తు కాదు. అవి యీశ్వరుని మహోద్దేశ్యమును గ్రహింపజాలవు. ఉత్కృష్టమయినట్టియు అద్భుతమయినట్టియు సౌందర్యముతో నలంకరింపబడిన యీలోకమును చూచుటవలన అవి ఆయానఘనతను గ్రహింపజాలవు. ఆత్మను సృజించుటవలన సృష్టిఘనతను ఆయన పూర్తిపరచెను, ఆయన ఆనందస్వరూపమును ప్రత్యక్షముచేశెను. భవుతిక ప్రపంచము యంత్రముమాత్రమే అయియున్నది, పశువులను మృగములును వాని వాని సహజగుణములకు దాసులయియున్నవి; శాశ్వతత్వస్వభావమును, పరమపురుషస్వభావమును పొందినమానవుడుమాత్రమె ఆయన అనుగ్రహమువలన ఆయన కుమారుడనెడి పేరునకు అర్హుడు జంతువర్గమునకు ఆయన కలుగజేసిన ఆసౌఖ్యముతో మానవుని తృప్తినొందునట్లు చేయలేదు. అవి ఆసౌఖ్యమునుమాత్రమే యెరుగును. అయితే యింద్రియసౌఖ్యము తే

మానవునిసర్వస్వమునుకాదు. తమ ఆత్మలనభివృద్ధి పరచుకొనక బ్రహ్మానందమునను భవింపజాలనివారు ఈశ్వర రాజ్యసుఖమేమాత్రమును లేనివారు కావలసినదేనా? కాదు; యితరజంతువులకువలెనే ఆయన వారికి యనేకసంతోషవిషయములను కల్పించియున్నాడు; సంవత్సరముతరువాత సంవత్సరమును, ఋతువుతరువాత ఋతువును, సూర్యోదయము మొదలు అస్తమయమువరకును అనేకవిధములవాను సంతోషపరుపబడుచున్నారు. అయితే ఈశ్వరునికరుణనుచూడుము; ఆమానవుని యీసంతోషములతోతృప్తినొందునట్లు చేయలేదు; ఆహార నిద్రలవలన మాత్రమే మానవుడెప్పుడును సుఖముగానుండజాలడు; వాడు విషయసుఖముల అనుభవముచేతమాత్రమే యెప్పుడును తృప్తినొందజాలడు. నిద్రించుచున్నను, గొప్పభరిమలో మునిగిపోయినను మానవాత్మ యీసౌఖ్యము అన్నిటితో నెప్పుడును తృప్తినొందదు. విశేషవృద్ధిచేతనుసహపరిసౌఖ్యములచేతను చుట్టబడినప్పుడు సహితము యేలమానవుడుసుఖముగానుండడు? నిరుపమానధనాధికారముల ననుభవించుచునుండియు, తనయాజ్ఞచేపరివిషయమును జరుపుకొనుచు, "నే నేలసుఖముగాలేన" నివాడుతనను తాను అడిగికొనినచో అతనివ్యర్థహృదయమందు సుఖములేదని ప్రత్యుత్తరము సిద్ధముగానుండును అతృప్తివానిపీడించుచుండుట యందేమి ఆశ్చర్యమున్నది? మానవుడేసౌఖ్యములన్నిటితో తృప్తినొందవలయునని ఈశ్వరోద్దేశముకాదు. మనస్తసౌఖ్యమును సర్వఫలములనుదయచేసెడి ఈశ్వరునియుద్దేశమునకువ్యతిరిక్తముగాపరివర్తింపుట మేలుకొరకైయుండునా? మనమీవిధముగా తృప్తిగాని సంతుష్టిగాని సంపాదింపగలమా? యీవిషయములన్నిటితో సుఖపడియుండుట మనయిచ్ఛయా? యీవిష

యసుఖములకంటె మనకు ఘనతరములైనవరములు లేవా? దయాస
త్యశీలములయందభివృద్ధినొంది తనను సమీపింపవలయునని ఆయన యి
చ్ఛయైయున్నది; మానవుని సృజించినయుద్దేశమిదియే. దేవతలతోన
హవాసము చేయుటకర్హులముగా ఆయన మనలనుసృజించెను; మనలనా
యనవయిపున కాకర్షించుకొనుటకు ధర్మమునకు పాలుదారులనుగ మ
నలచేసెను. విషయసుఖములో మునిగిపోవుటకై మనలనాయనసృజించ
లేదు. ధర్మముకొరకును ఈశ్వరునికొరకును యెన్నివేలవిషయసౌఖ్యము
లను మనంతటమనము నిరాకరించుకొనలేము! అయితే ఆయనయందా
నందించునప్పుడును, యితరజంతువులవలెఆహారపానీయాశక్తమతిభ్రమ
లోనుండునప్పుడును మనమట్లుయెన్నడును చేయలేము.

ఓపరమాత్మ! మమ్ములనందరను నీవయిపునకు నడపింపుమా;
మాదేహమును, మానసమును, ఆత్మను శాశ్వతత్వమునకు నియమింపు
మా. నిన్నువిడచిమాకు శాంతిలేదు, సుఖములేదు. మాహృదయము
లప్పుడు దుఃఖాంధకారముచే కప్పబడియుండును. నీవులేక మాసుఖమే
దుఃఖము, మావృద్ధియేక్షీణత, మాజయము అపజయముమాత్రమే,
మాదేహము, మామానసము, మాశక్తులు అన్నియునీనుండియే; కా
వున వానిని నీసేవకై వినియోగింపుము, మాహృదయములను నీకై సేవ
నెత్తుము.

---

## 16 వ ధర్మోపదేశము.

"నసీతుర్ప్రతిరేషామ్‌లోకానామ్ అసంభేదాయ"

"భేదపడకుండుటకొరకు యీసమస్తలోకములకును ఆయన ఆధారుడును మూలమును అయివున్నాడు. సర్వమునకునియామకుడయిన ఆపరమేశ్వరుని అధికారమువలన సృష్టియంతయు నడపింపబడుచున్నది. ఆయన సాధారణముగా కలిగియుండుటచే జంతులోకముదానివిధులననుసరించుచున్నది. మానవులందరును, జంతువులన్నియు, ఆపరమమూలాపితహృదయమున పాత్తుకొనియున్నవి. పునికినికలిగిన లోకములన్నిటిని తెలిసికొనుటకుగాని నిరూపించుటకుగాని సాధ్యముకానట్టికాలమున సృజించి, గృహముయొక్కగాని నావయొక్కగాని నిర్మాతతనపనిని నిర్వర్తించి దానితోనెట్టిసంబంధమునువుంచుకొనక విడచివెళ్లులాగున ఆయనవానిని విడచినాడా? ఆయన అట్లువిడచివెళ్లిన, లేక ఆయన దృష్టినింకను కాపాడుచున్నాడా? ఆకసమంతయు సర్వకాలమును దర్శింపవలెను, రక్షకునివలెను, సమస్తమునకును యిచ్ఛాశక్తిగనువున్న ఆయన ఆస్తిక్యముతోనిండియున్నది ఆయన యిప్పుడునువున్నాడు; మనమందరమును ఆయనయందుజీవించుచు, ఆయనయందు మనజీవమునుకలిగియుండును. ఆయనతోసంబంధించియున్నాము. సృష్టిఆయనయిచ్ఛచేకల్పింపబడి ఆయనయిచ్ఛచేత కాపాడబడుచున్నది. ఆయనయిచ్ఛప్రస్తుతకాలమందువలెనే పూర్వమును ఒక్కటిగానేయున్నది. ఆయనయిచ్ఛాప్రవాహము సృష్టికాలమునుండియు ప్రవహించుచు బ్రహ్మాండము కాపాడబడుచున్నది. నేను మాట్లాడనారంభించినప్పుడుఅట్లుచేయుటనా యిచ్ఛయైయున్నది;

యిప్పుడు నేను మాట్లాడుచున్నాను, యెందుచేతనంటే నాయిచ్ఛకు తెంపులేదు; దానికి తెంపుగలిగినక్షణమున నామాటలుఆగిపోవును. ఈశ్వర యిచ్ఛకు తెంపుగలిగినక్షణమున, యీసమస్తలోకముల నాశనమునకలుగును. యిచ్చటను ఆయన వున్నాడనియు, ఆయన సమస్తమునకు ప్రాణమువంటివాడనియు, ఆయన జీవముగల దేవుడనియు చూచుచు మనమాయనను పూజించుచున్నాము. యిప్పుడు నేను మాట్లాడుటలో నాయిచ్ఛాయునికి తెలుపబడుటలేదా? నీవు నన్ను చనిపోయిన శవముగనా లేక జీవించియున్న మానవునిగనా చూచుచున్నావు? అప్పుడునా వాక్కునకు వాక్కుఅయినట్టియు యెవనియిచ్ఛచే నావాక్యములు వెలువడుచున్నవో అట్టియు నాదేహమునకు ప్రాణదాతయు, సృష్టినంతను ప్రాణముతోడను చయితన్యముతోడను నింపినట్టియు, ఆయన నాకంటె నెక్కుడు ప్రాణవంతుడు కాడా; ఆయన ప్రాణమువంటివాడు కాడా ఆయన ప్రాణస్వరూపుడయి వెలయుచుండిన జీవముగల దేవుడు. యీ జీవముచుట్టును సృష్టియంతయు తిరుగుచున్నది. సమస్తమును ప్రాణతేజముల నాయనవలన పొందుచున్నవి. ఆయన యీ భక్తసంఘమునకు రక్షకదేవుడు. మన మాయనకు పూజనర్పించునప్పుడాయన దాని నందుకొనుచున్నాడు. మనమాయనను తండ్రివలె చూచుచున్నాము. భూతభవిష్యత్కాల విషయములు విచారింపనవసరము లేదు. మనకు ప్రకాశమును కలిగించు మనయెదుటనుండు దీపమును, ప్రాణమును, వాక్శక్తిని, గ్రహణశక్తిని కలిగించెడి మనచుట్టునుండు వాయువును, యివన్నియు ఆయన యిచ్ఛనాధారముగాగొని యున్నవి. ఆయన యిచ్ఛకు తెంపుగలిగెనేని యీదీప మారిపోవును. యీవాయువు చలనరహితము

గును. వాక్కు నిలచిపోవును సృష్టియంతయు ఆజగత్ స్రష్టి స్థితికారణుని యిచ్ఛననుసరించుచున్నది. ఆయన రాజులకు రాజును, చక్రవర్తులకు చక్రవర్తియు, త్రిలోకములకు రక్షకుడును అయియున్నాడు.

“ఏష సేతుర్వితరణ ఏషామ్ లోకానామ్ అసంభేదాయ”

“భేదపడకుండుటకొరకు ఆయన సమస్త లోకములకును ఆధారుడును మూలమును అయియున్నాడు” ఆయన యింకను సృష్టికంతకు ప్రాణమయి వెలయుచున్నాడు ఆయన సమస్తమునకును అతీతుడయి యున్నాడు. ఆమహాపురుషునికవి గుర్తుమాత్రమునసే అసంఖ్యాకములగు లోకములు పరివర్తించుచున్నవి. ఆయన వేలిగుర్తు మనమెక్కడచూడము. సృష్టియందు మన మెవని అంగుష్టాధికారమును చూచుచున్నాము; యెవని వేలిగుర్తువలన కోట్లకొలది లోకములు పరివర్తించుచున్నవో ఆసర్వనియంత వేలిగుర్తును మనము దానిలో చూచుచున్నాము. అభివృద్ధిస్థితినుండి క్షీణత్వమునకు నీతివంతుడు వచ్చినప్పుడును, తరువాత తనవృద్ధిని తిరిగి పొందినప్పుడును, వృద్ధినుండి క్షయమునకును, క్షయమునుండి వృద్ధికిని లోకముతో వాడు పోరాడునప్పుడును, తనమతమునందు విశ్వాసముగలవాడయి దృఢమనస్కుడయినప్పుడును, శరత్కాల కాంతియందు పూర్ణచంద్రుడు ఆకసమున వర్తింపుచు మేఘమునుండి మేఘమును దాటుకొని పోవుచు నిర్మలాకాశముచేరి తన స్వచ్ఛమయిన ధవళకిరణంబులచే భూమినలంకరించి మనకు నేత్రపర్వముగావించునప్పుడును, వానిలో యెవని వేలిగుర్తును మనము చదువుచున్నాము? జీవచరిత్రయందు మనమేమి చదువుచున్నాము? యెల్లమంది

వస్తువులమీాదను దానిచిహ్నమునుంచెడి ఆవ్రేలిగుర్తును మనము దా
నిలో చూచుచున్నాము.

ఆత్మ పాపభూయిష్టమయి అజ్ఞానాంధకారమున మునిగి నప్పుడు
ను, విచారముతోడను పశ్చాత్తాపముతోడను స్పృశించి తరువాత ఆత్మ
శాంతిని తిరిగిపొందునప్పుడును, పాపబాధలనుండి విడిపింపబడి నూతన
శక్తితోడను, నిష్కల్మషత్వముతోడను, ప్రవర్తించునప్పుడును, యెహో
వ
నిచేతిగుర్తును మనము కనుగొనుచున్నాము? సర్వ నియంత యయిన
యెహోవా! హస్తసంజ్ఞను మనము దానిలో చూచుచున్నాము. యెహోవనియిచ్ఛ
చే యెండిపోయినభూమి వర్షధారలచే చల్లబడుచున్నదో ఆయన యి
చ్ఛవలననే పశ్చాత్తాపహృదయము నెమ్మదిపడుచున్నది. ఆయన మన
లనేమియు గమనింపడా? పాపమునందును దుర్మార్గమునందును యిం
తగా మునిగిపోయినను ఆయన మనపయిపు ఒక్కచూపునయినను యె
ప్పుడును పరుపనంత మనఆత్మలఅసహాయముగ వదలివేసినాడా; యీ
దినమునసహా యిచ్చుటకు మనలనెవరుపంపినారు? సోమరితనము సౌఖ్య
మునందలి ప్రేమ సంతోషమునందు యిచ్ఛ యింకననేక దుర్వాంఛలును
మనస్సు నరికట్టును. వాటిని గమనింపక యీపరిశుద్ధ బ్రహ్మసమాజప్రా
ర్థనామందిరమునకు మనల నెవరు తీసికొనివచ్చిరి? హృదయకాలపుచుం
చును విడగొట్టుటకు సూర్యుని పంపినటువంటి ఆయనయే యీ పరిశుద్ధ
సమాజములోనికి తీసికొనివచ్చి మన హృదయ మాలిన్యమును పోగొట్టి
నది ఆయనయేకదా; యిప్పుడు యిక్కడకు వచ్చుటవలన నీవు పరిశుద్ధ
పరచబడితివి కావున ప్రేమాపుష్పముల నర్పించుటవలన పరిశుద్ధ హృద

యముతో ఆయనను పూజింపుము. భూతభవిష్యత్ కాలములగూర్చి మనమాలోచింప నవసరము లేదు. ఆయన యిచ్చట వుండుటనుజూచి ఆ యనకు మీావ్యాదయము లర్పణచేయుడు. ఆయనశక్తి అంతటను వ్యాపించియున్నది; సర్వమునకును సాక్షీభూతుడయి భాహ్యాంతరములయందంతటను ఆయనవున్నాడు. మన మొక వున్నతపర్వత శిఖరమున నెక్కి-అచ్చటనిలచి మననేత్రములచే ఆకసములో జొచ్చుకొనిపోవు మరియొక పర్వతశిఖరమును చూచితిమేని అచ్చటసహితము ఆయనఘనతను మనముజూతుము, సముద్రపుఒడ్డున నిలచి నురుగులతోనిండిన వరుసగానుండెడు వున్నతతరంగములను వీక్షించితిమేని అచ్చటసహితము ఆయనప్రభుత్వమును మనముచూతుము. నదిగొడ్లను వృక్షచ్ఛాయలను మనము నిలచి మనయెదుటనుండెడు ప్రవాహాచలనమును మనము గమనింతుమేని అచ్చటసహితము ఆయన ఆనందావిర్భావమును మనముచూతుము. ఆయన సర్వకాలములయందును సమముగనున్నాడు. ఆయనకుచీకటి,రాత్రియు,ప్రకాశించుమధ్యాహ్నమునుఅన్నియుసమానములే.ఆయన ఆత్మ అంతర్యమునందున్నాడు.ఆయన సంతోష సౌందర్యరాశి సమస్తమును వానిసౌందర్యమును ఆయన సౌందర్యమునుండియే పొందినవి. ఆయనశక్తివలన ప్రకాశమానుడయిన సూర్యుడు వుష్ణతేజకిరణములను పరవుచున్నాడు, ధావళ్యుడయిన చంద్రుడు దవళతను కురిపించుచున్నాడు. కారుమేఘమధ్యస్తమయిన విద్యుత్కాంతి ఆయనకాంతిచే ప్రకాశించుచున్నది. ఆయనను మనము చూడజాలకుండినచో సమస్తమును అంధకారమును కాంతిహీనమువయ్యెడిదే, నక్షత్రగోళకోటులుగల హద్దులేని ఆకసము సంతోషహీన మయినదయ్యెడిదే. ఆయనలేక సృష్టియంత

యు శూన్యగేహమయియుండును? శూన్యగృహమునందేమి సౌందర్యముగలదు; అట్లే మన హృదయములును వుండును. ఆయనలేక యీ హృదయము శూన్యహృదయము హృదయము ఆయనవునికిచే నిండింపబడకపోయిన అవ్యర్థహృదయముతో మనమేమి చేయగలము? యీ సృష్టి ఆలయమునందును యీహృదయ సింహాసనమునందును మనము ఈశ్వరుని కనుగొనకుండిన సమస్తమును నిరాశాంధకారము బాహ్యాంతరములయందు నిరాశ. ఆయనలేక సృష్టియంతయు వుద్దేశ్యరహితము. ఆదర్శహీనము, అగ్రాహ్యము. నియమరహితము, జ్ఞానవుడనయియుండి ఆయనను నేనుజూడకుండిన యీజన్మ వ్యర్థము. అయితే యీశ్వరునిదయ యంతఘనమయినది. మన ఆత్మనంతయు ఆయన వునికిచేత నింపివేసెను. మన ప్రేమ, కృతజ్ఞత, దయ, పరిశుద్ధవాంఛలు ఆయనన్నే కని పూజించుటచేతనే అన్నియుతృప్తిజెందుచున్నవి. ఆయన కృతజ్ఞులయిన కుమారులందరేకమయి పూర్ణ హృదయములతో ఆయనను పూజించెడు ఆ స్థలము స్వర్గతుల్యము. యీ లోకమును విడిచి ఆ శాశ్వతలోకమునందు మనమేమిజూతుము; యిదిఅనగా

"మధ్యేవామనమాసీనమ్ విశ్వేదేవాఉపాసతే"

దేవతులువారిమధ్య ఆయననుపూజింపుచున్నారు. దేవతాసంఘములో ఆ దేవతలదేవుని పూజింపశక్తులమగుట యెట్టిమహాభాగ్యము! మనఆత్మలు వృద్ధియొక్క ఒకస్థానమునుండి మరియొకస్థానమునకు అభివృద్ధినొందుచు తుదకు ఆయనహృదయమునకు హత్తుకొనును. ఓపరమాత్మా! మేమెప్పుడును మాహృదయములయందునీసౌందర్యమును తిలకిం

తుడుగాక. సూర్యచంద్రనక్షత్రవిద్యుత్ ప్రకాశములగు ఆకాశము స్త తేజములకును నీవు తేజమవయి యున్నావు. సమస్తసృష్టియు నీ తేజముచే వెలుగుచున్నవి. మా నేత్రములయొక్కయు, మా ఆత్మలయొక్కయు తేజమువు నీవే. నీవు తేజమునకు తేజమును సౌందర్యమునకు సౌందర్యమును. పాపబాధలనుండి నీవు మమ్ము కాపాడు నడనీవు తక్షణమే మమ్ముల నీమార్గమున నడపింపుము. నేనింక లోకబాధలపడజాల. నీవు మా నేత్రములయెదుటనిన్ను నీ వావిర్భవింపజేసికొనదవా? నీవులేక సూర్యచంద్రనక్షత్రములు సంతోషహీనములగును నా హృదయప్రభువా! నన్నెప్పుడును నీహితునిగను సహచరునిగను చేసికొనుమా. “ధనమును, గౌరమును నేనునీవద్దనుండి కోరను. శాశ్వతకాలము నీస్నేహితునిగను సహచరునిగను వుండులాగు ననుగ్రహింపుమా.

---

## 16వ ధర్మోపదేశము.

“ఆత్మానమేవ ప్రియముపాసీత”

“ప్రియమయిన దేవుని పూజింపుమా”

సృష్టికర్తయు జగద్రక్షకుడును నయినఆపరమేశ్వరుని ప్రియదృష్టిచే సృష్టియంతయుప్రవర్తించుచున్నది. మహాసముద్రములతో కూడిన యీభూమిమీదను, అసంఖ్యాకములగు లోకములతోకూడిన ఆకసము మీదను, అన్నిటిమీదను ఆయనప్రియదృష్టి ప్రసరించుచున్నది. ఆయన

సృష్టిసంతను ప్రేమించుచున్నాడు; యీజంతువులలోను. జీవులలోనుదే నినుండి ఆయనప్రేమను తిరిగినిరీక్షించుచున్నాడు? జీవముగలవియు, నిర్జీవముయినవియు అన్నియితరపదార్థములును ఆయనప్రేమను తిరిగిచూపజాలవు; మానవుడుమాత్రమే ప్రేమనుతిరిగిచూపుటవలన ఆయనప్రేమను గ్రహింపగలడు. ఆయన అన్నియితరజంతువులను ప్రేమించుచున్నాడు అయితే వానినుండి తిరిగిప్రేమనునిరీక్షించడు. మానవునివాడు తిరిగితనను ప్రేమింపవచ్చునని ఆయన ప్రేమించుచున్నాడు. ఆయన వానిని ప్రేమించి వానినుండి తిరిగిప్రేమను అంగీకరించుచున్నాడు మానవుడు యీలోకమును ప్రేమించి యుండుటలో మాత్రముతృప్తిపొందియుండక సృష్టికిహితుడయిన ఆపరమాత్మకు తనప్రేమనువ్యాపింపజేయుచున్నాడు. ఆయన మానవునినుండి తిరిగిప్రేమనునిరీక్షించుచున్నాడు; కావున ఆయనవానిని స్వతంత్రునిచేసెను, మానవుడు ప్రేమాకట్నమును చెల్లించుట తనశక్తిలోనిదైన స్థితిలోనుంచబడినాడు. అట్టిస్వాతంత్రియ స్థితి మానవునకుప్రసాదింపబడకుండిన, దేవుడు వానినుండి తిరిగిప్రేమను నిరీక్షకుండెడివాడే. కేవలము సృష్టికిదాసులయిన వాటినుండితిరిగి ప్రేమను ఆయననిరీక్షించలేదు స్వతంత్రులయినట్టియు, తమంతటతాము ప్రేమాకట్నమును చెల్లించింపకలిగినట్టియు, వారినుండియే ఆయన ప్రేమను తిరిగినిరీక్షించుచున్నాడు; అట్టివారుమాత్రమేమానవులు. ప్రేమ బలవంతమువలనగాని ప్రేరేపణచేగాని దాశికాదు. ప్రేమాధనముఃచేకొనదగినదిగాని శక్తిచే నియమింపబడతగినదికాని కాదు. యజమాని దురదృష్టుడయిన దాసినుండి వానిమెప్పుటవలన ప్రేమాకట్నమును పొందగలడా? ప్రేమావానముస్వతంత్రమయియున్నది మానవుడు తననుప్రేమింపవలెనని ఈశ్వరయిచ్ఛ అ

యియున్నది; కావున ఆయన మానవుని స్వతంత్రునిగ చేసెను. ఎల్లయితరవస్తువులను, అన్ని యితర జంతువులను, అనుల్లంఘ్యములగు సృష్టిశాసనములకు బద్ధములగునట్లు చేసెను. మానవునకు స్వతంత్రయిచ్ఛవలనతి ననుసరింపబడవలసిన మతములదయ చేసెను; ఆయన మనవను ప్రేమాశట్నమును చెల్లించుటకు బద్ధులుగాగా చేయులేదు నీతియందభివృద్ధి నొందినట్టియు. స్వాతంత్ర్యమైస్వేచ్ఛ కలదియై ప్రేమాపూర్ణమయిన ఆత్మనుండి ఆయన తిరిగి ప్రేమను నిరీక్షించుచున్నాడు. దానిసయయినట్టియు విషయవాంఛలనాధారపర్చుకొనినట్టియు ఐహికసుఖములలోపడి కొట్టుకొనుటవలన దుర్బలత్వమును పొందినట్టియు, విషయవాంఛలగణనసేయక ఘనమైన మతకర్మములనుసరింపజాలనంత బలస్వాతంత్ర్యములు లేనిదియు, నయిన ఆత్మనుండి ఆయన ప్రేమను తిరిగిపొందజాలదు. ఆయనదయను పరిశుద్ధతను శీలమును చూచునప్పుడు అప్రయత్నముగ మనసమర్పించిన ప్రేమను, దానినిమాత్రమే ఆయన అంగీకరించును మతాభివృద్ధి నొందినకొలదిని దాని సౌందర్యమును, సంతోషదాయకములగు లక్షణములును; అంతట ఆనందకేస్వరూపముగా గలిగినపరమేశ్వరునివయి మనకుప్రేమ అప్రయత్నముగ ప్రవహించును; మతస్వభావమిట్టిది దానియంతటయది యెప్పుడు ప్రవహింపదు? మనహృదయమందలిప్రేమను పశుకృత్యములచే చల్లార్చినప్పుడుమాత్రమే. నిశ్చయముగా స్వతంత్రమయినట్టియు సులభముగా విషయవాంఛాదితదురాలోచనలని గ్రహించునట్టియు ధర్మశీలములయందభివృద్ధి నొందినట్టియు, ఆత్మకు యీశ్వరుని ప్రేమించుటకంటె మధురమయినవిషయమింకొకటికలదా? ఆయనప్రేమకొరకు సమస్తసౌఖ్యములనంది సులభముగా విసర్జింపగలదు; సమస్తకష్టములను సులభముగా

నిగ్రహింపగలదు సూర్యోదయమయినప్పుడు రాత్రియందలి అంధకార
మును వుదయకాలమందలి మంచునువిడిపోవులాగున ప్రేమాదర్శము
నీఆత్మయొక్క యెల్లభయములును అన్ని సందేహములును తీరిపోవు
ఆత్మానందమనెడి స్వచ్ఛమయిన చంద్రకాంతి పరిశుద్ధహృద
దయమునందు పరివేష్టించును. ఆకాంతి యందు వాడు యీశ్వర ము
మును దర్శించునప్పుడు, ఆహా అది వానికెట్టి ఆనందము! ఏకమయిన
ఆత్మానందమనెడి స్వచ్ఛతేజమును, మరియొకటయిన యీశ్వరముఖ
పరిశుద్ధచింతనమును, యీరెండు తేజములును ఐక్యమగుటవలన యె
ట్టిఅద్భుతమయిన మహిమ ఆవిర్భవించుచున్నది? యీవిధముగా అద్ద
మువలె ఆత్మ అంతకంతకు స్వచ్ఛమగుచుండగా దానియందు యీశ్వ
ర ప్రతిబింబమును స్వచ్ఛతరమగుచుండును. మనఆత్మలో ఆయనతో అ
యిక్యము పొందినప్పుడు సమస్తమును అమృతమగును, జగత్తంతయు
నూతనరూపము దాల్చును; అపరిశుద్ధమయినదేదియు నిలవదు; అప్పు
డీలోకము ఆయన ఆలయము; సమస్తమును ఆయన ఆస్తికతచే నింప
బడినది. దేవునివిడచి మన స్వల్పవిషయములలో పనికలిగి యున్నప్పుడు
యీలోకము దాని నిజమయిన అనామధేయతతో మనకు కనబడును.
దేవునికంటె భిన్నమయిన మరిదేనియందయినను మన హృదయములు
నిలపినచో దానివలన మనము నష్టపడుట నిశ్చయము. ధనమును గౌర
వమును నీవెంతగా సంపాదించినను, నీశక్తిని నీఘనతను యెంతయెక్కు
వగా నీవు వ్యాపింపచేసినను, శాంతిని నీవెప్పుడును సంపాదింపజాలవు.
యీలోకములో ప్రతిదియు క్షణభంగురము. లోకవాంఛా తత్పరుడయి
న మానవునకు ఆ భగవద్భక్తుని వాక్యములు నిశ్చయముగా యదార్థ

మయినది. "నీకు ప్రియమయినది ఐశ్వర్యము; ఈశ్వర సంబంధమయిన
దాని నీవు సంపాదింపుము, శాశ్వతజీవమనెడి ధనము నీ కొరకు నిలువ
యుండును; నీవీధనమును సంపాదింపగలిగిన యింక ప్రతిదియు నీ విచ్చి
వేయగలవు. యేకాలమందయినను యెట్టిస్థితిలో నయినను దానిని నీవు
పోగొట్టుకొందువనెడి భయము లేదు". ఆయన మనతో వసించుచున్నా
డు; ఆ శాశ్వతజీవపు స్నేహితుడు యెప్పుడును మనలను విడువడు. ఆయ
న మననుండి తిరిగే ప్రేమను నిరీక్షించుచున్నాడు. మన ప్రేమాకట్నము
నాయనకు చెల్లింపనంత కృతఘ్నులముగ మనముందుమా? మన దేవున
కు కొంచెమయినను విడువనంత మన ప్రేమనంతను అర్పించవలసినదీలో
కములో నేమికలదు; దేవునినుండి మనల వేరుపరచి యుంచుటకు లోక
ములో నేమియాకర్షణముకలదు? లోకమందలి కష్ట సుఖముల మన
మందర మెరుగుదుము. ఆస్వయంభుని శాశ్వతజీవుని విడచి లోకమందలి
క్షుద్రవస్తువులతో మనమేమి చేయగలము? ఆయనను పోగొట్టుకొని శా
శ్వతకాలమునకు మనకు ధనమెవరు; సర్వకాలమును మనల రక్షించు
వారెవరు? మనకు శాంతియెక్కడ? మనకు మోక్షమెక్కడ? మన
మందరమును కలసి ఆయనకు ప్రేమాకట్నము నర్పింతుముగాక అట్లుమ
నజన్మమును సార్థకము చేసికొందముగాక, యిచ్చట వారమున కొక
సారి మనము చేరుచున్నాము. దానిఫలమును ఒకరోజుమాత్రమే నిలు
వవలయునా, మన మిచ్చట సంపాదించునది మనతో యెల్లకాలమునుం
డవలయునని మన ఆశయయి యున్నది. మిగతా ఆరురోజులకును దా
నిచింతనము మన హృదయమందు నిలచు లాగున ఆయన ముఖమును
అంతసమీపముగా దర్శింపుము; మనఆత్మాభివృద్ధి మనవుద్దేశ్యమయిన

న్నది. క్షణభంగురమయిన యీ రెండు గంటలలో మనమేమి చేయుదము యీస్థితి వాక్యకర్మలయందు పరివర్తింపబడుండిన యీలోక దుఃఖమును నుండి మిమ్ము వృత్తమస్థితికి కొనిపోబడుండిన పాపమునకును దుఃఖమునకును చొరరానిస్థలమున మిమ్ములనుంచబడుండిన యిచ్చటికివచ్చుటవలన ఫలమేమి? మత యొక్కదినముదికాదు రెండుఘంటలదికాదు దేవుడుకాలమునకు మాత్రమేకాదు ప్రతిదినమును మతాచరణములవలన మనలను మనము బలపర్చుకొనవలసియున్నది. ఆత్మశోధనలవలన మన రహస్యపాపములను మనము తొలగించుకొనవలసియున్నది. ప్రతిక్షణమును లోకములో పోరాడవలసియున్నది. ప్రేమయందును, ధర్మమునందును, అనుభవమును వృద్ధినొందవలసియున్నది. ప్రతిదినమును ప్రతిసాయంత్రమును దేవునియెదుట మనహృదయ గంహారములను తెరువవలసియున్నది. శాశ్వతకాలము మన మాయనకొరకు స్వాభిమానమును విడువవలసియున్నది. మన మిచ్చట ఆయనను పొందినచో లోకములో మనకు భయములేదు. యిచ్చట యేకొరతయులేదు. యెల్లకాలమును ఆయన అనుగ్రహముచే నన్ను చుట్టుకొననిమ్ము. అప్పుడు మరణసమయమున నా దేశములో నున్నాననుకొనుటకు బదులు పరదేశములో నివశించితినని సంతోషమును పొందుదును. మా పూర్ణహృదయములను పూర్ణమానసములను పూర్ణఆత్మలను ఆయనకర్పింపుము. ఓ పరమకారుణ్యుడా! సమస్తమును నీకర్పించుటవలన మేము నిర్భయులముగా నుండు దినము వచ్చుగాక.

---

## 17 వ ధర్మోపదేశము.

"యథా సౌమ్యవయాం సివాసోవృక్షం సంప్రతిష్ఠంతే ఏవంహావై తత్సర్వంపర ఆత్మనిసంప్రతిష్ఠతే"

"ఓసౌమ్యస్వరూపుడా! పక్షులు వృక్షమును నాశ్రయించుకొను నట్లు సమస్త వస్తువులును పరమాత్మ నాశ్రయించుకొనియున్నవి"

ఈశ్వరుని పరిత్యాక ఆస్తికతను యిచ్చట నిరూపించుకొనుటవలన మన మేమి లాభమును పొందితిమో, మనయందు ఆయన పరిశుద్ధాత్మ యెంతవరకు పరిఫలించినదో ఆయనతో మనసంబంధము నెంతవర కనుభవించితిమో యిప్పుడు మన మనము విచారించుకొందము. మన దేవుడు "మహాన్ ప్రభుర్వై పురుషః" మహత్తయిన గొప్పపురుషుడని మన మెరుగుదుము. ఆయనను మనము ప్రేమింప లేనట్టియు, ఆయనతో నివసింపజాలనట్టియు, ఆయనకు మనసు సర్వం జేసికొన లేనట్టియు స్వరూపుడును తండ్రియు ఆయన కాదు. ఆయన సింహాసనమును మనము సమీపింపజాలనట్టియు తెలిసికొనజాలనట్టియు నిరూపింపజాలనట్టియు స్థలమున ఆయన నివసించుటయు లేదు.

అయితే యిచ్చట మన మెవ్వరి పూజించుకొరకు చేరితిమో ఆయన మనతో నివసించుచునసహా వున్నాడు. అంతే కాదు మన ఆత్మయందు నివసించు చున్నాడు. ప్రేమాపుష్ప సమర్పణము నాయన అంగీక రించుచున్నాడు, మన ప్రార్థనావాక్యముల వినుచున్నాడు. మనదేవుడు అనంతుడును శాశ్వతుడునని యీసత్యముమనమానసములందు బలముగా నాటుకొనియున్నది. సూర్యచంద్రగ్రహ నక్షత్రములు లేనప్పుడు

ను కటికచీకటి ఆకాశమున పరివర్తించుచున్నప్పుడును యీపరమాత్మ జ్యోతులకు జ్యోతియయి ప్రకాశించెను. యీ అనంతుడయిన దేవుడు ఒక్కడేయయి యుండెను. వడ్లును గోధుమలును విత్తనములనుండి పెరుగులాగున సృష్టి జడతత్వమునుండి వృద్ధియైన దీలాగున కాదు. అయితే యీసృష్టి యిచ్ఛామాత్రుడయినట్టు జ్ఞాన స్వరూపుడును, జీవస్వరూపుడును యయినట్టియు పరమపురుషునినుండి వుద్భవించినది. సృష్టి ఆరంభకార్యములనుండి ఆయనయిచ్ఛ తెంపుకలిగియుండలేదు. ఆయన యిచ్ఛాప్రవాహము యిప్పుడుసహితము ప్రవహించుచున్నది. ఆయన సర్వమునకును సృష్టికర్త. ఆయన సమస్తమునకును ఆధారుడు ఆయన యిచ్ఛవలన సమస్తమును సృష్టి అయినది ఆయన యిచ్ఛ వలన సమస్తమును కాపాడ బడుచున్నది. ఆయన సమస్త మునకును ఆధారుడనియు సృష్టి నంతయు ప్రేమించుచున్నాడనియు ననెడి మరియొక అమూల్యమయిన సత్యమును మనమిచ్చటనే నేర్చుకుంటిమి. అయితే మానవునినుండిమాత్రమే ఆయన ప్రేమను తిరిగినిరీక్షించుచున్నాడు ఆయన ప్రేమాదృష్టిచే సమస్తమును పరివర్తించుచున్నది. అయితే వానినుండి ఆయనప్రేమను నిరీక్షించడు. అయితే మానవునినుండిమాత్రమే ప్రేమ యత్నము నంగీకరించుచున్నాడు. యిది ఆయనతో మన ప్రత్యేక సంబంధము. యితరజంతువులలో అదియొచ్చటను కనుపడదు. ఆయన మననుండి ప్రేమను నిరీక్షించడు. గావున ఆయన ప్రేమను తిరిగిమనము చూపగలుగునట్టి వరము ప్రసాదించెను. యీ వరము మన స్వతంత్రమయియున్నది. మనలను స్వతంత్రులనుగాచేసి ప్రేమించు శక్తిని మనకాయన దయచేసెను. మన స్వభావము నాయనమతితత్వము

తో కూడినదానిగా చేసెను. ఆయన సౌందర్యమును ఆనందస్వరూపమును దర్శించుటవలన మనము బుద్ధిపూర్వకముగా ఆయనను ప్రేమించులాగున మన ఆత్మలను ధర్మపూర్ణములు చేసెను. ఇది మన వరములన్నిటిలో శ్రేష్ఠమయినదియు మన జీవితార్థమును అయియున్నది. ఆ ప్రేమయే మననుండి ప్రేమను నిరీక్షించును గావున మన పూర్ణ ఆత్మలను ఆయనకు ప్రేమతో నర్పింతుము గాక. మన హృదయములను పరిశుద్ధపరచుకొని మన మానసము నందలి మాలిన్యమును నీచత్వమును తొలగించు కొని ప్రేమకు పరమోద్దేశ్యమయిన ఆ పరబ్రహ్మమును మనము ప్రేమింతుము గాక. తండ్రి తన బిడ్డలనుండి ప్రేమను నిరీక్షించులాగున మన హృదయప్రీతిని ఆయన నిరీక్షించుచున్నాడు; తన హృదయములోనికి గ్రహించుటకయి ఆయన తన హస్తములను జాచుచున్నాడు. అట్లు మన ఆత్మలను పరిశుద్ధపరచుకొని ప్రేమా హృదయముల శాంతిని పొందవలయునని కాలమునకై దేవుడు వేచియున్నాడు. ఆయనకు మన ప్రేమాకట్నమును బుద్ధిపూర్వకముగా నర్పించునట్టియు మనల నాయన తన కౌగిలిలోనికి గ్రహించునట్టియు కాలమునకై వేచియున్నాడు. ప్రేమ మన గొప్ప విలువగల ధనము. అమూల్యమయిన ఆస్తి యేలనన దేవుని తండ్రివలెను మానవుని సోదరునివలెను అది చూచును ఆ ప్రేమనుండి కలిగిన ఆ కార్యము పరిశుద్ధమైనది దేవుని సహవాసమున మొదట పరిశుద్ధపరచబడిన ఆ ప్రేమ లోకమునకు తిరిగి వచ్చినప్పుడు మధురోదకముల చేతను ఆనందాంబువుల చేతను దాని ప్రదేశములను ఆవరించును. ఆయనను మనము ప్రేమింతుమా; శాశ్వత కాలము దేవుని ప్రేమాశ్రయమున నుందుమో ఆయన యెడల మనము అనర్హులుగా నుందుమా?

సృష్టిప్రపంచముతో ఆయనకుగల సంబంధముకంటె మనతో ఆయనకుగల ప్రత్యేకసంబంధము కేవలము వేరువిధమయినది. బ్రహ్మసమాజ (పరిశుద్ధాస్తికసమాజ)మందిరమునకు భూమి ఆధారమయినట్లును యీదీపమునకు వాయువాధారమయినట్లును, సర్వాశ్రయములకును ఆయన ఆశ్రయుడయియున్నాడు. పునాదిలేక గృహము నిలువజాలనట్లును, వాయువులేక దీపము వెలుగజాలనట్లును. దేవుని ఆశ్రయము లేక మనము ఉండజాలము. వృక్షములమీద పక్షులాశ్రయము పొందినట్లు సమస్తవస్తువులును పరమాత్మనాశ్రయించియున్నవి. సమస్తమునకును ఆయన ఆధారుడనెడి యీసంబంధమును సాధారణముగా అన్నియు కలిగియున్నవి అయితే ఆయనతో నాసంబంధము యింతకంటె అధికమయినది. తండ్రివలన కుమారుడు పోషింపబడునట్లు ఆయనవలన మనము పోషింపబడుచున్నాము; లేక ప్రజలు ప్రభువువలనను సేవకుడు యజమానివలన పోషింపబడునట్లును మనజీవితముయొక్క ప్రతిక్షణమందును పోషింపబడుచున్నాము. ప్రస్తుతమును, సర్వకాలమును మనమాయన సేవకులము, ఆయనప్రజలము, ఆయనబిడ్డలము, ఆయన మనతండ్రి, మనతల్లి, మనయజమాని. ఆయనతో మనకు గలిగియున్న సంబంధము స్వతంత్రులమయిన మనము స్వతంత్రులయిన యితరులతో కలిగియుండు సంబంధమువంటిది. ఆయనను ప్రేమించునట్లు మనలనాయన బంధించియుండలేదు. మనమతిస్వభావము అట్టినిర్బంధమునకు లోబడియున్నదిగాదు. బెదరింపువలన ఆయన ప్రేమనాకర్షింపడు; అయితే ప్రేమనర్థించుటవలన మనప్రేమనాయన నాకర్షించును. ఆయనయిట్లు చెప్పెను. "నిన్ను వృద్ధిపరచుకొనుము; విశ్వాసమునందు నీఆత్మను బలపర్చుము దయతో నీహృదయమును నింపుము, నావద్దకు వచ్చుటవలన శాంతిని పొం

దుము. అయితే ఆయన ఘనమైన నియమములను మనము సర్వదా అనుసరింపజాలము. మన మెంత మర్త్యులమో మన మెరుగుదుము, మన ప్రయత్నములు తరచు వ్యర్థమగును. ఆ పరమావధి మన జ్ఞానముచేతను ధర్మముచేతను పొందజాలము. మన మెంత మర్త్యులమో, కొరతయు మాలిన్యమును గలవారలమో ఆలోచించునప్పుడు సమస్తమునకు ఆధారుడయిన మన పరమపితను అప్రయత్నముగా ప్రార్థింతుము; అప్పుడు మన ఆత్మ పూర్ణముగ ఆయనకు లోబడును; అంతట మరియొక మార్గమును మన మెంతమాత్రము కనుగొనజాలకుండుటను చూచి మన నేత్రములు ఆయన వైపునకు మళ్లును; మన ప్రార్థన లాయనను చేరును, అంతట మనము ఆయన మన ఆశయమనియు మన పిదాప అనియు, మన విధేయతకు విషయమనియు, మనము చూతుము. అప్పుడు మన మెవరి సలహానున్ను కోరము. అయితే మన ప్రయత్నముగా నా సమస్తమును, ప్రాణము, హృదయము, ఆత్మను తీసికొనెదనా యని అడుగుదుము పూర్ణవిశ్వాసముతో ఆయన కిచ్చుకు మనల నర్పణ చేసినప్పుడు అనుభవించెడి అనిర్వచనీయమగు ఆనందము మన హృదయములో నిమిడింపజాలము, అంతేకాదు, సృష్టి యంతయు దానిని వర్ణించుకొనజాలదు. అర్పణ యొక్క ఆ ఆంతర్య స్థితి నిర్వచనమునకు ఆయన పూజయయి యున్నది. నేనాయన వలన పోషింపబడుచున్నాననియు ఆయన నా ఆధారుడనియు, నేనెంత అల్పుడననియు, ఆయన యెంత ఘనుడనియు నేను చూచునప్పుడును, మన కొరతలన్నిటి శాంతికొరకు ఆయనవైపు మనము చూచునప్పుడును మన ఆత్మల అంతర్ప్రదేశమునుండి యీ ప్రార్థన బయలుదేరును. "అజ్ఞానమునుండి జ్ఞానమునకును, అంధకారమునుండి ప్రకాశమునకును, మృత్యువునుండి శాశ్వతత్వమునకును మమ్ములను నడిపింపుమా."

ఆయనపూజయందుమనజీవమున్నది, ఆయనపూజయందు మనజీవముయొక్క శాశ్వతాభివృద్ధివున్నది మనమాయనను ప్రస్తుతకాలమున పూజింపుచున్నాము. మనమాయనను భూతకాలముయొక్క జ్ఞాపకమునందుపూజింపుచున్నాముమనమాయనను భవిష్యత్ కాలమునందుదృష్టినుంచిపూజింపుచున్నాము. మననిజమయినతండ్రియనియు మనపూజార్హుడయినదైవమనియు చూచిభక్తితోడనుగౌరవముతోడను మనమాయనను ప్రస్తుతకాలమున పూజింపుచున్నాము భూతకాలమున ఆయన సంతతసౌఖ్యఅనుభవమువలన మనకృతజ్ఞతార్పణలను ఆయనకుచేయుచున్నాము; పాపమునందువిముఖములగుటకు బలముగలవారమగుటకును భవిష్యత్ కాలమున ఆయనప్రియదర్శనమును చూచుటకుశక్తిగలవారమగుటకును మనమాయనను ప్రార్థించుచున్నాము. ప్రతిదినము అంతను కంత కెక్కువగా ఆయనదయాకర్మములను సర్వదాదర్శించిమనమాయనను పూజింతుముగాక. మనము సర్వదా ఆయనఆశీర్వచనముకై ప్రార్థింపుచు ఆయనకుమనలనర్పణము చేతుముగాక ఆయనవలన బలమును ధయిర్యమును ధర్మమును పొందుదుముగాక. అనుదినము నూతన ప్రేమాంబుల్గ్రహించి మనహృదయముల సంతతకంతకునిండింతుముగాక. ఆయనయొక్కయీమానసికపూజ ప్రతివారమును మనమిచ్చటనేర్పుకొనుచున్నాము. ఓపరమాత్మా నీపూజవలనఅనుదినము వృద్ధినొందునట్లును మాజీవితార్థము సాధించునట్లును నీకృపమాకు నేర్పుము.

---

## 18వ ధర్మోపదేశము.

"నమామహా దేవమాత్మబుద్ధి ప్రకాశంముముక్షుర్వై శరణమహం ప్రపద్యే"

"ముముక్షువునగు మానవుని ఆత్మ జ్ఞానమును ప్రకాశింపజేయు ఆదేవుని శరణమును పొందుదును"

సమస్త సృష్టికిని దేవునితోగల సంబంధము అనగా ఆధారాధేయసంబంధము మానవునకును సృష్టికంతకును సమానమయినది. దేవునితో మన ప్రత్యేక సంబంధము యింక మరియే యితర దానితోగల సంబంధమునకంటె యెక్కువసంబంధమును, ఉన్నతమును, ముఖ్యమును బలవత్తరమును అయియున్నది. ఆసంబంధముండుటచేతనే మనమీ ప్రార్థనామందిరమున చేరియున్నాము. ఆ సమస్తమును ఆయన నాశ్రయించియున్నది. సమస్తమును ఆయనయందున్నది. ఆయనలేక యెవరును జీవింపజాలరు. ఆయనలేక యేదియు వుండజాలదు. యిచ్చట యీగోడయు యీ స్తంభమునుసహా ఆయన నాధారముగా గొనియున్నవి. అయితే అవిఆయన నెరుగవు. మానవునిమాత్రమే యీసంబంధమును తెలిసికొనునట్లు ఆయన అనుగ్రహించెను; అంతేకాక మానవునినుండి పూజను ప్రేమను ఆయన నిరీక్షించును. ప్రేమాకారుణ్యమును, మతాశ్రయుడును అయిన ఆపరమేశ్వరుడు మననుండి ప్రేమను నిరీక్షించును. మనహృదయమందలి వినయమును, భక్తి, ప్రేమయనెడి పుష్పములు వికాసమునకు ఆయన కారుణ్యము. మనమాయనకు వానినితిరిగి అర్పించుచున్నాము. ఆయన మనలను స్వతంత్రులనుగా చేసెను. మన మాయనను యి

చ్ఛాపూర్వకముగ పూజించుచున్నాము, మన హృదయములను మానసములను ఆయన కర్పించుటకును. ఆయనను గౌరవపర్చుటకును, ఆయననుపూజించుటకును, ఆయనకు సాష్టాంగపడుటకును. మనలనాయన ఆజ్ఞాపించుచున్నాడు. మనలనుండి ఆయన యేమినిరీక్షించుచున్నాడో దానిని మనము అర్పించుచున్నాము. ఆయన మన అర్పణను గ్రహించుచున్నాడు. మనమాయన కివ్వజాలని దేమియున్నదో మనవలనవచ్చినదేదియు లేదు ఆయనవలన సంపాదించినదానిని ఆయనకిచ్చుటకు మనమేల సందేహింపవలెను? మీవిషయ వాంఛల నాయనకు బల్పెట్టుడు మీ శరీరమును వున్నతిచేసి దానిని ఆయన పాదములయొద్ద అర్పించుడు. మీ హృదయపాపములను త్రెంపివేయుడు. వికసించిన మీ హృదయకమలములతో ఆనందస్వరూపుడైయున్న పరమేశ్వరునకు వాని సువాసన నర్పణ సేయుడు.

మన మొదని పూజనిమిత్తమిచ్చుట నేరినిమో ఆయన మనయెడల అశ్రద్ధగా నున్నాడా? లేదు; ఆయనయెప్పుడును మనయెడల అశ్రద్ధగా లేదు. ఆయన మనలను వుపేక్షతో చూచుచున్నవాడు కాదు. ఆయన యెప్పుడును మనతో నున్నాడు. మనతో నుండి మన సత్ప్రయత్నములయందు సహాయము చేయుచున్నాడు. ఆయన ఇష్టమును సహింపక మనయందు ప్రేమను గౌరవమును కలిగించుచున్నాడు. మన మానసములనుండి పరిశుద్ధ వాంఛలను వెలిపుచ్చుచు. మనమానసములలో సత్యం తనుపంపుచున్నాడు. మన స్వాతంత్రియమును బలపరుచుచు మన ధర్మమును వృద్ధినొందించుచును నున్నాడు. ఆయనతో మనకు బంధముట్టినది. ఆయన మన యెడల యెట్లు నిరంతరమును ప్రేమాబిందువులను కురిపించుచున్నాడో

యెట్లు మనకు యెప్పుడును వ్యర్థముకాని సహాయమును చేయుచున్నా డో మన మెరిగినప్పుడు మన పూర్ణ ప్రియమును ఆయనయందుంచి ఆ యనను మనము విశ్వసింపమా? ఓ ప్రాణీ, ఓనీతిమంతుడవగు తరుణవ యస్కుడా! పాపమునుండి విడిబడుటకు నీవు నిశ్చితమయిన తీర్మానము ను చేయుచున్నావు నిన్ను ప్రోత్సాహపరుచుటకెవరును లేరా? నిన్ను నీవు దుర్బలునిగ కనుగొనవచ్చును. నీ సహస్ర ప్రయత్నము లన్నియు వ్యర్థములగుట కనుగొని నీవు నిరాశుడవు కావచ్చును. నీ వున్నతమ యిన పరమావధిని చేరుటకు నీఅసమర్థత నీ కనుభవము కావచ్చును; అయితే యెప్పుడును నిరాశ చెందవద్దు. నీ మానవ దేహములోనికి యీ శ్వరుడు తనదివ్యశక్తిని పంపును ఆయన హస్తముతో నిన్ను పట్టుకుని పాపమునుండియు పశ్చాత్తాపమునుండియు దూరముగా నిన్ను నడపిం చును. ఆ శాశ్వితలోకమునకు మన పయనమును యాత్రార్థులము ఆ యనను మన మాశ్రయించియుండిన మార్గమందే ష్టములును మనల చేరవు. మనల నిర్భయులగానుండుడని యాజ్ఞాపించెడి పరమేశ్వరుని శ రణమును పొందినప్పుడు మనమేభయమును పడనవసరములేదు మనల స్వతంత్రులగాచేసి మనల నొంటరిగా విడచిపెట్టెను; అయితే ఆయన మనతో యెప్పుడు మన్నాడు.

మనల స్వతంత్రులనుగాచేసి మన అల్పబలమును ఆధారపర్చుకొన నట్లు మనలవిడిచిపెట్టెను. మన మొక్కసారి పడిపోయిన సహాయము కొ రకు ఆయనను పిలువజాలనంత దూరముగ మనలనుండి ఆయన వెళ్ళిపో లేదు. అది అట్లుండిన మనము స్వతంత్రులము గాకుండినదే మంచిది. అదిఅట్లుండిన పాపికి యేఆశయు మోక్షమునకు యేమార్గమును లే

కుండెడిదే. ఆయన మనలను స్వతంత్రులనుగ చేసెను గావున ఆయన మనతోనుండుటకు నింకయెక్కువ యగత్యమున్నది యిందుకొరకే ఆయన నిజముగ మనతోనున్నాడు. మనముకూడ దానిని కొన్నిసమయముల యందనుభవింతుము. బిడ్డను తండ్రి యొంటరిగా విడచినప్పుడు అందువలన వెంటనేపడి దాదాపుగా ప్రాణమును పోగొట్టుకొనకుండుటకయి నడచుటను నేర్పుటకు వాడు దానితో నుండును బిడ్డ తనబలమును నాధారపర్చుకుని నడచునప్పుడు భయముతో నడచును అయితే తనతండ్రి చేతిని పట్టుకొని నప్పుడు అది నిర్భయముగలదగును. దేవుతో మన సంబంధము దీనివంటిదే. ప్రాపంచిక కష్టములతోడను ఆపదలతోడను. పోరాడి మనల బలపర్చుకొనునట్లు యీ లోకములో మనల నాయన యొంటరిగా విడచును. అయితేమనము వెంటనే పడిపోయి తిరిగీకనుగొనబడకుండుటకు ఆయన మనతోనున్నాడు. కొన్నివేళల ఆయన మనస ప్రయత్నములయందు ప్రోత్సాహపరుచును, ఒకసమయమున ఆయన ఆగ్రహముఖమును చూపుటవలన దుర్వాంఛనుండి మనలనరికట్టును; మరియొకసమయమున మనకున్యాయమయిన శిక్షనుకలిగించి మనలదిద్దును ఈవిధముగా మనఆత్మలయందెప్పుడును వాసముచేయుచు ఆయనమనకు బలమునుప్రసాదించును. యిది ఆయనతోమనకు గలబలవత్తరమయినఆత్మీయ సంబంధము.

ఓపరమేశ్వరుడా; ఆత్మజ్ఞానమును ప్రకాశింపజేయువాడా, ముముక్షువునయి నీశరణుజొచ్చుచున్నాను. నాఆత్మకు సద్బుద్ధిని నాహృదయమునకు సన్మార్గాచరణమును ప్రసాదింపుమా. నీ యిచ్ఛకు నన్ను దాసునిగా చేయుమా. ఓదేవా! నన్ను నీసహచరునిగ చేయుమా.

## 19 వ ధర్మోపదేశము.

"సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ యోవేద నిహితంగుహాయాం । పరమేవ్యోమన్ సోశ్నుతేసర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా॥ (ఉపనిషత్ వాక్యము)

"దేవుని సత్యస్వరూపునిగను, జ్ఞానము అనందమయునదిగను గృహాంతరమునందును ఆకాశమునందు ప్రచ్ఛన్నట్లుగా యెవరు తెలిసికొనియెదరో వారు సర్వజ్ఞుడయిన ఈశ్వరునితో సర్వకామముల తృప్తిని పొందుచున్నారు "

బాహ్యపదార్థములయందు పరమేశ్వరుని సుందర శోభాకారము ప్రతిబింబించుచున్నట్లు మనము కనుగొందుము! ఆయన సునత ఆనందమయుఁ [illegible] ప్రకటింపబడినట్లు మనము చూచుచున్నాము. నదీప్రవాహములందు ఆయన ఆనందావిర్భావమును, సముద్ర తరంగములయందాయన శక్తిని, సూర్యకిరణములయందాయనవృసికిని మనము కనుగొందుము. మన నేత్రముల నంతర్గోచరములు గావించునప్పుడు ఆయన ఆవిర్భావమును, ధర్మస్వరూపతను మన హృదయములయందు మనము గమనింతుము. హృదయముల ప్రభువును మనము ప్రత్యక్షముగా చూచునప్పుడు ఆయన ప్రేమ. ఆయన పరిశుద్ధత, ఆయన శీలము ప్రకాశించుచున్నట్లు మనకు కనపడును. ఆయన మన హృదయమునకు ప్రభువు; ప్రియమయిన మన హృదయద్రవ్యము. మన హృదయముల నెప్పుడు యినుపద్వారములచే బంధింపకను, హృదయరాజ్యమునుండి

హృదయమును తొలగింపకను వుందుముగాక. హృదయముల రాజ్య
ములో సంతోషదాయకమయిన మనహృదయములకు రాజుగా యీశ్వ
రుడు ప్రవేశించుగాక మన వాంఛల నన్నిటిని ఆయనకు ప్రత్యేకములయి
నవిగాచేసి ఆయనను సేవింతముగాక. సృష్టియావత్తును దేవుడు నివసిం
చుచున్నాడు. నక్షత్రములును, గ్రహములును ఆయన మహిమను సుందర
మయిన సమత్వముగల శాసనము చే తిరుగుచున్నవి. అట్లే మనహృదయ
రాజ్యములో మన హృదయప్రభువును మన ప్రయత్నములన్నియు ఆ
యన సేవయందుండును. దేవుడు ఆయన ఆలయమును ప్రవేశించునప్పు
డు మన మాయనసేవయందేలయుండకూడదు? ఆయన మన మనుభవిం
చుచుండిన ఆధనమును ఆయనకర్పించుటవలన మనమేల భాగ్యవంతుల
ముకాగూడదు? ఆయన ప్రియకార్య సాధనము [illegible] నే
ల నిరాకరించవలెను. ఆయన కొరకు మనమేమి చేసినను అది ఎంత స్వ
ల్పమయినదయినను ఘనమయినదియు పరిశుద్ధమయినదియు నై యుం
డి. ఆయనకార్యమునుచేయుచున్నాను అని తలంపుతో [illegible] కొ
క్కపూటభోజనమిడిన అది ఘనమయిన పనియయియున్నది. స్వప్ర
యోజనముకొరకును, డంబముకొరకును, గౌరవమును గొప్పతనమును
సంపాదించుకొరకును వేలకొలదిజనుల కాహారవస్త్రములనొసంగిన అది
యింకను మిక్కిలి అల్పమయినకార్యము. ఆయనకువినయముతో మన
మేకార్యముల నొనరించినను అదినాశనరహితమయినపని; దానిఫలముల
నంతము, పరిశుద్ధుడవై ఆయనను నీహృదయాకాశమునందుంచుము, నీ
కు ప్రాణాపాయము కలుగుచుండినను ఆయనపనుల నెరవేర్పుము, అప్పు
డు ఆయనతో నీయెల్ల వాంఛలతృప్తి నీకు కలుగును.

మనము దేవునిబిడ్డలము. స్వతంత్రపురుషులము. మనము బుద్ధిపూర్వకముగా అర్పించినదానిని, మాత్రమే ఆయన అంగీకరించును. ప్రేమతోడను, భక్తితోడను, ఉత్సాహముతోడను చేసిన ఆ పూజను మాత్రమే ఆయన అంగీకరించును. ఆ మనసత్కార్యములలో దేనినిమనము హృదయములోతోడను ఇచ్ఛతోడను చేసెదమో అదిమాత్రమే ఆయనకు ప్రీతికార్యముగ యున్నది. దేవుడు మనలను స్వతంత్రులనుగా చేసెను. స్వతంత్రము మనకు ననుగ్రహించిన అదృష్టము యున్నది సృష్టియంతయు ఒక యంత్రము మాత్రమే, దేవుడు యంత్రికుడు. స్వతంత్రముగా చేసి తననుండి మానవుని వేరుచేసినట్లు చేసెను సూర్యుడును చంద్రుడును, వాయువును వర్షమును, శీతకాలమును, ఉష్ణకాలమును, అగ్నియు ఆయనకు విధేయతతో. అవి ఆయన శాసనము నతిక్రమించి నొక్కయడుగయినను కదలజాలవు. అయితే మానవుడు ఆయన ఇచ్ఛను సులభముగా నతిక్రమించుచున్నాడు. మన బాధను బుద్ధిపూర్వకముగా తెచ్చుకొనుచున్నాడు. తనను మలినపరిచినను చేసికొనుచున్నాడు. అట్టి దౌర్భాగ్యదశకు వచ్చుటమాత్రమేగాక మనపరమపితనుండి విడిపడి దినములుగడుపుటయేగాక మనస్వతంత్రము యొక్కపరిణామమునను. యెట్టి అసంబాధముగు ఆలోచన! మొదటను నన్నాలోచించుట విస్మయమే అయితేదేనియందు విశ్వాసముగా అంతరార్థము యున్నది మనము బుద్ధిపూర్వకముగా ఆయనతో చేరగలందులకు దేవుడు మొదట మనలను తననుండి వేరుచేసెను యెప్పటికి ఆయననుండి దూరముగా నుండకుండా, మనము స్వతముగ ఆయనకర్పించుటవలన ఆయనను పొందగలుగుటకు మనస్వస్థితినిమనకిచ్చెను ఇచ్ఛలేక మనమాయనయొద్దకు వెళ్లజాలము. మనకువాక్కుగలిగినట్టియు మనదియనిపిలు

ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తింతుమేని దేవునినుండి విడివడుదుము, అయితే స్వతంత్రులమగుటవలన ఆయనకును మతమునకును బుద్ధిపూర్వకముగ దాసులమగుదుమేని అప్పుడు ఆయనతో చేరుదుము, యెక్కువ వున్నతమయినట్టియు, ముఖ్యమయినట్టియు సంబంధము ఆయనతో నేర్పడును ఆయన సృష్టి యంత్రమునంతయు నడపెడివాడు. అయితే ఆయన మన తండ్రి. ఆయన సృష్టికాధారుడు అయితే మనముండినంత సమీపమున భౌతికసృష్టియందేదియు యుండజాలనంత అధికముగ నింకను మనకు ఆధారుడయి యున్నాడు. అయితే మనమాయన కెంతదగ్గరగ నుండినను శాశ్వతకాలమునకు ఆయన నంతకంతకు సమీపింపుచు ఆయన నాధారము నంతకంతకు అధికముగ గ్రహింపుచును వుందుము ఆయన తక్కినఅన్నిటిని ప్రేమించుచున్నాడు, అయితే ఆయన మననుండి ప్రేమను నిరీక్షించుచున్నాడు. ఆయన పాదములయొద్ద మనమందర మేకమై ప్రేమాపుష్పముల నర్పింతుముగాక.

ఓ పరమాత్మా! మమ్ములను స్వతంత్రులనుగ చేసితివి కావున మమ్ముల నొంటరిగా విడువకుము. మా పూర్ణమయిన యాధారము నీయందున్నది. నీవు మా సహాయుడవు, మా ధనమవు; నీవు మా తండ్రివి, స్నేహితుడవు, మేము నిన్నాశ్రయింతుము. నీసౌందర్యప్రదమై ఆనందదాయకమయిన నిముషములను చూపింపుమా, నీప్రేమతో నన్ను పరిశుద్ధపరుపుము. అట్టి జీవితమంతయు నీ సత్కార్యాచరణమునందు వినియోగించుటకు శక్తి కలుగులాగున నాయిచ్ఛను బలపర్చుమా.

---

## 20 వ ధర్మోపదేశము.

"యో వై భూమా తత్ సుఖం న అల్పే సుఖమ స్తి" ఉపనిషత్ వాక్యము.

"ఘనుడయిన వాని సుఖము స్వల్పవస్తువులతో పూర్ణము కాదు"

ప్రపంచమనెడి భీకరనము ద్రమును నీవు దాట నిచ్ఛయింతువేని భయమును తొలగించెడి సృష్ట్యాతీతమగు యీశ్వర పాదములను పొందవలయునన్న ఆఘనుడయిన ఈశ్వరుని సర్వదా నీదృష్టియందుంచుకొనుము. యీ సమయమునుండి ఆఘనుడయిన పరమేశ్వరునకు నిన్నర్పణచేసుకొనుము. నీజ్ఞానము నభివృద్ధి కావించుకొని ఆయం ఘనమయిన సత్యస్వరూపమును పొందుమా; నీప్రేమ నభివృద్ధిపరుచుకొని ప్రేమా స్వరూపుడయిన ఆయనకు అర్పణచేయుమా; నీయిచ్ఛను బలపరుచుకొని ఆయన ఆనందయిచ్ఛకు దాసునిగ చేయుమా. నీవు పూర్ణముగ ఆయన ఆశ్రయమున నుండుమా. శరీరమును మానసమును మనయంతట మనము సంపాదించి యుండలేదు. మనకేహక్కును యేవరమును గలవో వానిని యీశ్వరునినుండి గ్రహించినారము; అంత అమూల్యమయిన స్వాతంత్రవరము సహితము ఆయన ప్రసాదమే. మనమిష్టం దేమిచేయుదుము, దేవునినుండి విడివడి దివారాత్రములు మన స్వల్ప విషయముల లో చిక్కుకొని దుఃఖింపుచుందమా. లేక మన సమస్తమును దేవుని బుద్ధిపూర్వకముగా సర్పించుటవలన మన స్వల్పహక్కును వదలుకొందమా? మన సౌఖ్యమెప్పుడును స్వల్పవిషయములతో కూడియుండదు;

లోకము మన ఆత్మలను తృప్తిపరుపఁజాలదు. ఎండమావులవంటి ఐహికసుఖములకై ప్రయత్నింతుము; అయితే మన దాహమును తీర్చుటకు ఒక్క నీటిబొట్టయినను మనకు దొరుకదు. లోకమునుండి తిరిగి తిరిగి ఆటంకములను పొంది తుదకు మనము ఆ శాశ్వతత్వతోనే అయిక్యము పొందుదుము; దుఃఖబాణములచే గ్రుచ్చుకొనబడి చివరకు మనము సౌఖ్యాంబుధిని చేరుదుము, స్వల్పవిషయములయందు సౌఖ్యము లేదనియు యిచ్చట మనసుఖము దుఃఖముగా పరిణమించుననియు మన ప్రతిదిన అనుభవములు ఎరుగుదుము. స్నేహితుడని కౌగలించుకొనుబోయిన వాడు విరోధిగా తిరుగును. యీలోకము సౌఖ్యప్రదేశము కాదు దేవుడీలోకమును సౌఖ్యప్రదేశముగా చేసి యుండలేదు. యిచ్చట మనము నేర్పబడి ఆయనతో చేరియుండుటకు ఆయన మనల నిచ్చటనుంచెను. లోకములో పోరాడుటవలన ప్రతిమొక్కరును మనము యెక్కవలసి యున్నది. అయితే మనము దేనిని యేబలముతో పోరాడవలయును? మననేత్రముల మనకై త్రిప్పినప్పుడు మనమెంత దుర్బలులమో మనము కనుగొందుము దేవుని నాశ్రయించియున్నప్పుడు బలమునకును ప్రోత్సాహమునకును స్థానభూతమయిన దాని చేరుదుము; దుఃఖములును కష్టములును సహనమును వృద్ధియగునట్లనే దేవునివయిపు నడచుటకు సహాయపడును; మన ఆత్మకన్నిటి వృదకముచే వృద్ధినొంది దేవునివయిపు లేచును.

నీ సమస్తమును దేవునికర్పణ చేయుము, సత్యస్వరూపుడును ఆనంద స్వరూపుడును అయిన ఆ సుందరుడయిన పరమేశ్వరునితో జ్ఞాన

మునందును, ప్రేమయందును యిచ్ఛయందును ఐక్యమునొందుదుము. మన
సమస్తమును యీశ్వరునకు బుద్ధిపూర్వకముగా నర్పణచేయజాలకున్నము
న స్వతంత్రమువలన ప్రయోజనమేమి? ఒకప్పుడు యీసమస్తవస్తువుల
ను విడచిపోవలసియున్నది, ప్రపంచమును, ప్రాపంచికధనమునకును, ఘ
నతకును ఆశవిడువవలశియున్నది. మనము యిప్పుడు జీవించుచున్నామను
టనిశ్చయము; కొలదిదినములతరువాత మనము విడచివెళ్లవలయునను
టయు అంతనిశ్చయము కొలదిదినములయినతరువాత మనమాటలు
ఆపబడును; మనచేతులుచల్లబడును. దేవునికిబుద్ధిపూర్వకముగాయివ్వ
నిదానిని మృత్యువునుండి బలాత్కారముగాలాగికొనును. కావునజా
గ్రతగానుండవలెను కావునదేవునినుండి గ్రహించిన మనసమస్తసాతును దే
వునకర్పించుటవలన శాశ్వతఫలములనందుదుముగాక. మననశ్వరమయినట్టియు
క్షుద్రమయినట్టియు వస్తువులకు ప్రతిగా అమూల్యమయిన తరుగనిధనము
ను పొందుదముగాక. యిప్పుడుమనము జీవించియుంటిమి గావున, మన
జీవమును, మనమానసమును. మనసమస్తము బుద్ధిపూర్వకముగా ఆయ
నకర్పింతుముగాక. ఆయనహస్తములలో నుంచబడి యీజీవము అమూల్య
మయి నశ్వరమయినట్టిజీవమగును ఆయనను పొందుటకుస్వార్థత్యాగము వ
లె కనుబడునట్టి దేదియుండుకాదు? మనసమస్తమును వదలుకొనిన, మత
సౌఖ్యములనుపొంది ఈశ్వరునిఅనుగ్రహమును సంపాదించిన, మనముసం
పాదించిన, మనముసందేహింతుమా? మనహృదయము వాంఛించున్నయము సుల
భముగా వానినివిడువజాలనంత ప్రాపంచికక్షుద్రవిషయములతో అంత
గాలీనమయియున్నవి; అయితే మనయెదుట దేవుని ఆశీర్వాదము నొక్క
సారి యనుభవించిన, ఆయన అనుగ్రహాశ్రయమును నొకసారి యెరిగిన,

మనహృదయ పాశములోనికి సాగిసడలిన, అప్పుడు మనమాత్రము ఈశ్వరుని కొరకుత్యజించుట యెంతసులభమగును. ఆయన అనుగ్రహముఖమునుదర్శించుటకు మనసర్వమునిచ్చుటకు ఆగకున్న లేదనిగా, అప్పుడు మనకుకనబడును. అప్పుడు లోకముయొక్క తుచ్ఛత్వము మనకుబయల్పడును; అప్పుడు మనము దేవునితో నిన్నుసర్వదా మాహృదయములయందెట్లునుంచుకొనగలమని చెప్పుదుము? మానవ స్తనును నీవుతీసుకుని నీసమీపమునమ్మునుంచుదువా? రెండవక్షణమున ప్రాపంచికఆకర్షణలచే మోహింపబడునంతమనవుద్దేశ్యములంత నీచస్థితిలోనున్నవి; దేవునిగూర్చినఅన్ని మంచితలంపులును మనమానసములనుండిపోవును తిరిగి మనమాయనకు దూరమగుదుము. మనము ప్రయత్నించి దేవుడుమనను౦డి యెప్పుడును విముఖుడయియుండడనెడి యీసత్యముపరిశుద్ధాత్మకృతానుగ్రహమువలన మనము నేర్చుకొంటిమి ఓనీతిమంతుడా యీవిధముగా నీవేలదుఃఖించుచున్నావు; నీవింత దుర్బలుడవని తెలిసికొన్నటకు నీవంతదుఃఖముతో నేలయున్నావు? అయితే నిరాశచెందవద్దు. నిన్నునీవు నిజముగా దిద్దుకొనవలయుననెడి బలమయిన యిచ్ఛనీకు గలదేని అది నిశ్చయముగ తృప్తి పొందింపబడును. నీమంచి యుద్దేశ్యమేదో యది యీశ్వరుని యుద్దేశమునకు అయివున్నది. తన ప్రతికుమారుడును నీతియందును ధర్మమునందును వృద్ధినొందవలయుననుట ఆయన యిచ్ఛయయివున్నది. ఆయన ప్రియపుత్రుల హృదయములయందు జీవపారిశుధ్య ప్రవాహముల పారునట్లుచేసిన దాయనయే. మనహృదయముల యినుపద్వారములచేబంధించి మన మాయనను దూరముగానుంచుచుండిన ఆయనయెప్పుడును తనను దూరముగా నుంచుకొనడని నిశ్చయముతో నుందుము.

నీహృదయమును, మానసమును, నీసమస్తమును ఆయన కర్పింపుము; దీనహృదయముతో నీవాయనయొద్దకు వెళ్లుము ఆయన నిశ్చయముగా నిన్నుగ్రహించును. తండ్రి యెప్పుడయినను తన కుమారుని గ్రహించుటకు అయిష్టపడునా. మనపూర్ణహృదయముతో తనను ప్రేమింపవలయునని ఆయన యిచ్ఛయించినప్పుడు ఆహృదయమండలి ప్రేమాగ్నిని చలినీటిచే ఆర్పునా? ప్రాణము నర్పించియయిన ఆయన హస్తము నవలంబించుటకు మనము ప్రయత్నించునప్పుడు ఆయన మనకుతన సహాయమునీయడా? మనము పాపంబునుండియు దుఃఖంబునుండియు రక్షింపబడుట కిచ్ఛయింతుమేని ఆయన మనలతనచేతిలో పట్టుకొని పాపమునుండి రక్షింపడా? ఆయనయొకట మన కన్నీళ్ళనీడచినప్పుడు ఓదార్పుమాటలచే మనకన్నీటిని పోగొట్టడా? ఆయనకొరకు మన మాశించిన ఆయన ముఖకాంతిని మనకుచూపించి మనఆశను శాంతింప జేయడా? లేదు, ఇది యింకొకవిధంబుగ నెప్పుడును యుండజాలదు. ఆయనవయిపు మనయొక్క అడుగుదేసిన ఆయన వెయ్యిఅడుగులు దాటివచ్చి మమల కవుగలించకొనును. మనమునుండి నొక్క ప్రేమాణువును గ్రహించినను ఆయన నిరంతరంబును మనమీద పూర్ణప్రేమను కురిపించును. ఓహా, దీనహృదయములో ఆయన ప్రేమామృతంబు నెంతవిస్తారంబుగా కురిపించుచున్నాడు. దీనహృదయంబుతో ఆయనను సమీపింతము; మన అల్పత్వంబును నీచత్వంబును గ్రహించినయిచి ఆయనయొకటని లచి యిట్లు పిలుతము. ఓ ప్రాణంబునకు ప్రాణమా, జ్యోతులకుజ్యోతీ నీఅనుగ్రహ ముఖంబును మకుచూపి మాహృదయంబుల నీవయిపు ఆకర్షించు కొనుము; నీ నుండి మేము యెప్పుడును విడిపోము.

నిన్ను మా హృదయంబుల నుండి దూరంబు చేసికొనము; యిప్పుడు మా అల్పత్వంబును దీనత్వంబు మేము విసర్జించితిమి కావున మేము నీకుపూర్ణముగలొంగుదుము నీఅనుగ్రహమును ప్రాపించుభాగ్యముకలిగింపుము సంపాదింతుము; నీ ధర్మమును మా హృదయములయందు నిలుపుదుము పాలించి కాలక్షేపమువలన మేమెప్పుడును మోక్షమును పొందుదుము. నీ వయిపు మేమును దినమును సమీపింతుము; నీదృష్టినొందుట మా దినములు గడుపుదుము; మా జీవనమును నీ హస్తమందు అర్పింతుము, మా సమస్తమును నీవు గ్రహింపుము.



## 21వ ధర్మోపదేశము

"ఈశావాస్యమిదం సర్వంయత్కించ జగత్యాంజగత్ తేనత్యక్ తేనభుంజీతామాగృధః కస్యస్విద్ధనం"

"సృష్టియందేమిగలదో అదియంతయు ఈశ్వరునిచే వ్యాప్తమగు నున్నది పాపమునువిడిచి ఆయనను పొందుడీ, యితరులసొత్తును దొంగిలించవద్దు."

సృష్టియంతయు ఈశ్వరునివిజ్ఞానముతో నిండియున్నది. యేదికలదో అది యెంతగొప్పదియైనను, యెంతస్వల్పమైనదియైనను ఆయనవిజ్ఞానముతో నిండియున్నది. ఆయనపదార్థములో లీనమయియున్నాడు; ఆయన ఆత్మతో అయిక్యభావముననున్నాడు ఆయన లేకపదార్థమంత

యు నశించి పోవును; ఆయన లేకమానసంబుయొక్క ఆలోచనలంతర్ధాన ముందును; హృదయ ప్రేమ ఆరిపోవును; ఆత్మ జీవంబు అంతంబునొందును మనమందరి ఆస్తిక తయు ఆయన ఆస్తికత వలననయియున్నది. మనము జీవించియున్నట్టే ఆయనయుతో నిశ్చయంబుగా జీవించుచున్నాడు మన దేవుడు వ్యర్థమయిన దేవుడా? యెవరు లేక ఆత్మజీవము క్షీణించునో ఆయన జీవించుచున్నట్లు మనము తెలిసికొనజాలమా? ఆయన కేవలము మన మనోవికారమా? కాదు. ఆయన వ్యర్థుడయిన దేవుడు కాడు, ఆయన మానసోద్దేశ్యము కాదు. ఆయన గుణముమాత్రమే కాదు, ఆయన కేవలము జ్ఞానమే కాదు, లేక బలముమాత్రమే కాదు, పదార్థము లేక గుణముండజాలదు. దేవుడు పరవస్తువయి యున్నాడు. ఆయన శక్తిజ్ఞాన ధర్మముల పూర్ణపురుషుడయి యున్నాడు. ఆయన సత్యమునకు విశ్రాంతి స్థలము, ఆత్మకు మూలము, మనకాధారుడు ఆయనతోతప్ప యెవరితో మనకు జీవసంబంధ ముండియున్నది? ఆయన యింద్రియాతీతుడు; అయితే మన హృదయములో ఆయనకు సహస్ర జ్ఞాన మార్గములున్నవి. ఆయన మన పరమపిత. ఆయన యిచ్చట సహితా మున్నాడు; ఆయన మనతో సహా వున్నాడు. ఆకసము ఆయన ఆవిర్భావముతో నిండియున్నది. మన దేహములో ఆత్మ లీనమయియున్నట్లుగానే ఆయన ఆస్తిక్యము యీసృష్టిలో లీనమయియున్నది. ఆయన మన చుట్టును అంతటను ప్రత్యక్షముగా నున్నాడు, ఆయన మన హృదయములో ప్రత్యక్షముగా నివశించుచున్నాడు, యెవని జ్ఞానము శక్తి ధర్మముతో సృష్టియంతయు నింపబడినదో ఆయన ఆత్మకు ఆత్మస్థానములో నివ

సించుచున్నాడు. నాకు ఆయనకంటె దగ్గరగా నేదియు లేదు. ఆయనతో పోల్చిన యెల్ల యితరవస్తువులును నానుండి దూరముగా నున్నవి. మన ప్రాణస్నేహితులు ఆయన వున్నదానికంటె అధిక సమీపముగా నెప్పుడును వుండజాలరు. యితరులందరును మన దేహమునకు వెలుపటనుండి మనతో సంభాషింతురు. అయితే ఆయన ఆత్మమధ్యమున నున్నాడు. మనకును యితరవస్తువులన్నిటికిని మధ్యను అవకాశమున్నది. అయితే దేవుడు మనహృదయమును నిమ్ముకొని లోనికి ప్రవేశించును. ఆయన నిరాకారుడయిన నేమి? మనము స్వభావమై ఆకారరహితమయిన అవకాశమును మాత్రము ఆలోచించవలసినది లేదు. నన్ను నేను తెలిసికొన్నప్పుడు నన్ను లేనివానిగా తలచుకొనుచున్నానా? నిరాకారమయినను మన ఆత్మను మనము గ్రహింపజాలమా? మన జీవితమునకంతయు ఆధారుడయినవాని, గ్రహించుటకు మనమేల శక్తిగలవారము కాకూడదు. మన స్వల్పజ్ఞానము మనకు అనంతమయిన జ్ఞానమును బోధపరుపదా, ప్రేమాపూర్ణుడయి పాపరహితుడు అయిన పరిశుద్ధపురుషునివయిపునకు మన దయయు ధర్మమును మనల నడపించుటలేదా? మన దేవుడు హద్దులేనివాడనియు అంతములేని వాడనియు పరిశుద్ధాసీకముతమునుండి మనము నేర్చుకొనియున్నాము. ఆయన హద్దులేనివాడును ఘనుడును అయినట్లు ఆయన మన అల్పహృదయములను సహితము నింపజాలడా? ఆయన ధర్మము, ధర్మమునసహితము అపారమైనది కాదా? ఆయననుకూర్చి యేమియు తెలిసికొనజాలమా? మనము ఆయనను పూజింపలేమా? కేవల అవకాశమునకే మనప్రేమ నర్పింతమా? అది అట్లుండిన దేవుడు వుండినను లేకుండినను అంతయు నొకవిధముగా నుం

డెడిది. అయిన యిది నిశ్చయముగా అట్లు కాదు. ఆయనతో మన సంబంధము మిక్కిలి సామీప్యమయినది. ఆయన సృష్టికంతటికిని దేవుడు; అయితే ఆయన మనకిని ఆయన అవకాశమునకు అతీతుడు "పరత్వకాశాత్" యింకను ప్రతివానికిని దగ్గరగా నున్నాడు. ఆయన మనకు సర్వదా మిత్రుడు; నన్ను నేను చూచుకొన్నప్పుడు ఆయనను నా శ్వాసమయినట్లు కనుగొందును. ఆయన రాజ్యము దూరదూరముగా నున్నట్టి సూర్యగోళములందును లేక దూరదూరములుగానున్న నక్షత్రములయందును స్థాపింపబడలేదు; మన హృదయము ఆయన ఆనందాశ్రమము. ఆయన మన జ్ఞానకారణుడు ఆయన మన నిశ్చయమయిన సదభిప్రాయముల స్థానభూమి. మతముయొక్క శాశ్వత సత్యములకు ఆయన కారణుడు.

పరమేశ్వరుడు మన హృదయ ప్రదన్యమైనచో ఆయనను మనమేల చూడజాలము? ఆయనకును మనకును మధ్య అవకాశమున లేనిది నిలచియున్నది? ఆ అవకాశమును మనమే అయియున్నాము. ఇతర విషయములయందలి మనయిచ్ఛ, ఆశయు ఆ అవకాశమయి యున్నవి. దేవునినుండి మన మిట్టిసిద్ధముగా దూరమున లేము ఆయననుండి మనలో త్రోసివేసినవి మన స్వాతంత్ర్యపరత్వమును మన గర్వగమును అయియున్నవి, పరిశుద్ధాత్మ నుండి యొక్క సంచారమిది. ప్రాపంచిక సౌఖ్యములందలి యిచ్ఛలనన్నిటిని విడుచుట వలనను, పాపముయొక్క మలినమునంతయు పోగొట్టుకొనుట వలనను బ్రహ్మానందము ననుభవింపుము; మనము అపరిశుద్ధులమైన అపరిశుద్ధ పురుషుని సన్నిధికి వెళ్లుటకు మనకు యిచ్ఛ యెట్లుండును దౌర్భాగ్యులము, దీనుల

మును అగుటచే ఆయనను పొందుటకు ఆశ యెట్లుండగలదు, మనపా పములవలన దేవుడు మనమీద దృష్టినుంచుటలేదని మనమనుకొనవచ్చును హృదయప్రభువును మన హృదయములు కనుగొనజాలవు. అప్పుడు ఆయన మన హృదయంబులలో జొచ్చుటకు యెట్టి ప్రయత్నములు చేయుచుండెనో మనము తెలిసికొన జాలము. యీశ్వరుని నీవు సమీపముగా చూడవలెనన్న నీహృదయమును పరిశుద్ధపరచుకొనుము. నీతో వృద్ధియగుచుండిన యేరహస్యపాపమునయినను తరిమివేయుము. అప్పుడు ఆయన అనుగ్రహమును నీవు చూచితీరవలెను. మనలో నెవ్వరిని తననుండి దూరముగా నుంచవలెనని యీశ్వరుడు నిశ్చయించుటలేదు. యెప్పుడు మనల గ్రహింపవచ్చునో యని సమయము కొరకు ఆయన నిరంతరమును ప్రయత్నించుచున్నాడు. మన హృదయమును ఆయనకు యేల తెరచియుంచము: మనము ఆయనఅనుగ్రహజలమునకు యేల వేచియుండము: ఆశగలహృదయముతో ఆయనను మనమేల వెదుకము:

అయ్యో మన పరమపిత మనకొరకెంత చేయుచున్నాడో మనమెల్లప్పుడును ఆలోచించము. మన మట్లు ఆలోచించియుండిన ఆయనను మనమంత మరచియుండకుండెడివారము అహో! సృష్టినంతకును రాజును, అచింత్యుడును అనంతుడయిన పురుషుడుయెక్కడ యీ దీనులయి అధోలోకమునన్న యీజీవులెక్కడ; అయినను ఆయన మనలను మరచిపోలేదు. ఆయనదయకు మనమేవిధమునను అర్హులము కాము. ఆయన మనకొరకెంత చేయుచున్నాడు. ఆయనకొరకు మనమేమి చేయగలము. ఆయన మనవద్దనుంచి యేయితరవస్తువునుకోరడు. ప్రేమనుమాత్రము నిరీక్షించును. దీనమైనవిధమున ఆయనయొద్దకు వెళ్ళి పిలుతము

మాహృదయముయొక్క పూర్ణప్రేమను నీకు మేమర్పించుచున్నాము. నీవు సంతోషముతో గ్రహింపుము; ఓపరమాత్మా నీవు మాకెంతదగ్గరిగానున్నావు; నీవు అంతదూరముగానున్నట్లు మేమేలతలచవలెను. మేము పరియత్నింపము కావున నిన్ను చూడలేము. నీవు మావంకచూచుటలేదని మేము తలంచుచున్నాము అయితే అది మా పొరపాటువలననేనని మేము వగచుచున్నాము. నీకొరకు మేమానకలిగియుండిన యీక్షణమే నిన్ను నీవు తెలుపుకొందువు. అయితే యింకను నిన్ను మేము మరచియుందుము. ఓపరమాత్మ మాపూర్ణహృదయమును పూర్ణశక్తిని బలమును నిన్ను గనుగొనుటయందు అర్పింతుముగాక. మాప్రేమానంతయు నీకర్పింతుముగాక. మాజీవితమంతయు నీసేవకయి వినియోగించునట్లు అనుగ్రహింపుమా

## 22 వ ధర్మోపదేశము.

"యదిదమ్ కిఞ్చ జగత్సర్వమ్ ప్రాణ యేజతి నిఃసృతమ్"

"సృష్టియేదికలదో అదిసమస్తమును వ్యాపింపచేయబడి ప్రాణస్వరూపుడయిన ఈశ్వరునియందు పరిభ్రమించుచున్నది

ఆయన ప్రాణస్వరూపుడు ఆయనసమస్తవస్తువులయందును ఆవిర్భవించి యున్నాడు. ప్రాణస్వరూపుడయినఆయనవలనలోకములన్నియు సృష్టింపబడినవనియు, ఆయనశాసనములననుసరించిఅవిహానిపనులయందు పరివర్తించుచున్నవనియుప్రాణస్వరూపుడైన ఆయనయిచ్ఛాపరివాహామింకనుపారుచున్నదనియు సమస్తసృష్టియుఆయనయందు ప్రవర్తించుచున్నది

నీయు యీగొప్పసత్యమును పరిశుద్ధాత్మమతమునుండిమనము గ్రహించితిమి ఆయనమనజీవముకలిగినట్టియు. మేలుగానినట్టియు దేవుడు. ఆయన మనహృదయమునకు పరమార్థము; ఆయనను పూజించుటకే మనమిచ్చట చేరియున్నారము; మనము యిచ్చటికివచ్చినది ఆయినకు ప్రేమను అర్పించుటకే కావున ప్రేమాస్వరూపుడైయున్న ఆయనప్రియదృష్టినిగమనించుటవలన నీజీవితమును సార్థకము చేసికొనుము. ఆయనసర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వనియామకుడు, అంతేగాక సర్వశక్తుడు; ఆయనను పూజించుటకును ఆయనకు ప్రేమను అర్పించుటకును మనమిచ్చట చేరియున్నారము. కావున జ్ఞాననేత్రము ఆయనను యిచ్చటదర్శించులాగున ఆసయందలి మన ప్రేమను ప్రకాశింపచేతము. ఆయనసర్వజ్ఞుడైయు. సర్వవ్యాపియైయు గ్రహించి ఆయనపూజకొరకు ఆశకలిగియుందము: ప్రాపంచికసౌఖ్యములందలి దురాశాంధతేమియు మనస్సునకు జొచ్చి మనస్సును కలవరపరచకుండుగాక ఆ సుంతయు మనము పరీక్షించుకొనుచుండిన సమయమునిప్పుడువచ్చినది గాన మనహృదయద్వారములతెరచి ఆయన ఆనందముతో మన మానసముల నింపునుగాక శాశ్వతకాలమువరకును మనస్నేహము మనహృదయముల ఆనందములో ముంచుచుండుట మన కెంతటిఅదృష్టము ఈమనదేశము మిక్కిలిదుర్బలమైనది. ఈదుర్బలమైనబీదదేశమందు జన్మించి మనమందరము నీచులమైతిమి; ఈ ప్రార్థనామందిరమున మన యెదుట ఆయన ఆవిర్భవించుటకు ఈశ్వరకటాక్షమెంతఘనమైనది దుర్బలమైన బిడ్డలయందు మాతృప్రేమ అధికముగనున్నట్లు మనదేశముమీదల ఈశ్వరకటాక్షము అధికముగా యావిర్భవించుచున్నది. ఆయన యనుగ్రహమును యెంతగా గ్రహించి యాయనను మహిమపరచి ప్రేమతో ఆయ

నకు నష్టమగునకదా? ఆయన అనుగ్రహము మానవమాత్రులను అయివున్నది. శుద్ధాంతఃకరణము మనకు విశేషముగా ననుభవించుమంటిన ఈశ్వరసాక్షాత్కారము ప్రతిదినమును యీస్థలమునకువచ్చునట్లు చేయునుగాక! హృదయమును శుభ్రముచేసి నాసక్తి గలిగియుండిన యీశ్వరుని యనుగ్రహమును జేరి పొందియున్నారు; మనము నొక్క అడుగుముందుకునడచిన ఆయన సహస్ర బిందువులుగా అమృతమును కురిపించును మానవులము యిప్పుడి ఆనందోద్రేకముల సంబంధమును నిలుపుకొనజాలమా? ఆయన సుందరమయిన ఆనందస్వరూపమును గమనించి మన హృదయమును ప్రకాశింపచేతము సృష్టిలోనివాటన్నిటిని విసర్జించుటవలన మనఆత్మనుపరిశుద్ధపరుతుముగాక! మతమునకును దేవునకును దాసులమగుట మూలమున స్వాతంత్ర్యమును గాంచుదుముగాక, యెప్పుడును యిచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపకుందుముగాక. ఎవరుతమస్వతంత్రాము ఆజ్ఞపెట్టుకొనజాలరో, యెవరు యిచ్ఛానవాహమును మతానుసారముగ ప్రవహింపచేయజాలరో. యెవరుతమకుతామే యొజమానులు కారో, అట్టివారికంటె యెక్కవదౌర్భాగ్యులను నీయిలను యెవరున్నారు?

“ఇంద్రియాణాంహిచరితాం। యన్మనోనువిధీయతే। తస్యహరతి ప్రజ్ఞాంవాయుర్నావమివాంభసి॥”

మనస్సువిషయవాంఛల ననుసరించి ప్రవర్తించునదగునేని సముద్రమందు తుపానులోచిక్కుకొనినఓడవలెనివసించుటను దానుగనుండుటయెంతదుఃఖకరమును, వర్ణనాతీతమునునై యున్నది. దుష్టతలంపులకు లోబడుటయొట్టిబాధనో చెప్పుటకొనకేనోరాడదు పరిశుద్ధాస్తికమతి

ముమన మెట్టినరకబాధను అనుభవించెడివారము. మనమంతకంతకు పాప
మునకు దాసులమయ్యెడివారము; ప్రాపంచికపంజరములో గట్టిగా బంధింప
బడియుండెడివారము అయితే పరిశుద్ధఆస్తికమతానుగ్రహమువలన యీ
శ్వరునియందు మనము నిరాశజెందలేము; మనమనుదినమును ఆయనసహ
వాసమువలన అధికబలవంతులమగుచున్నాము. మనఆత్మకు పరిశుద్ధఆస్తి
కమతమునకంటె తగినదేదియును లేదు; పరిశుద్ధాస్తికమతమునకు మన ఆత్మ
కంటె అనుకూలమయినదేదియును లేదు. గొప్పతేజస్వియైన సూర్యుడు
తూర్పున వుదయించి ప్రపంచమునంతయు వెలిగించునట్లు యీ తూర్పు
దేశమునందు పరిశుద్ధ ఆస్తికమతము వుదయించుచున్నది. అది యింత
టినుంచియు క్రమముగా ప్రపంచమునకంతకును దాని తేజమును వ్యా
పింపచేయును. మనము యీమతమును నిరాకరించిన మన దేహము దు
ర్బలమగును. మనమానసము క్రమముతప్పును మన ఆత్మ క్షీణించును.
నీవు దానిని ఆశ్రయించిన దానిశక్తివలన నీవు బలపరచబడుదువు కొం
కొలది జనులు నీకు విరోధముగా వారికత్తుల నెత్తినను అభేద్యమగు
యీశ్వరకవచముచే కప్పబడుటవలన నీవింక సమస్తభయములను వీడు
దువు. కాబట్టి యీ పరిశుద్ధ ఆస్తికమతమును మన మందరమును మి
క్కిలి శ్రద్ధతో కాపాడుదుముగాక. అదినిన్ను సర్వదారక్షించును. యీ
ప్రపంచమునకును యీ అనంతసృష్టికిని మతమయిన పరిశుద్ధ ఆస్తికమత
ముతో నీహృదయము నిండింపుము నీ మంచినడతవలన అది సమస్త
మంతయు వ్యాపించును ఓపరమాత్మా యీమృత్యులోకములో పరిశు
ద్ధఆస్తికమతము యెప్పుడు అధికముగా ప్రకాశించును. ఓర్వలేమి దురా
లోచనలు మాదేశము నెప్పుడు వదుచును. యీశ్వరప్రేమయందు మె

ల్లెగను నెరవేర్చను యోగ్యులగుదురు. పరిశుద్ధ ఆ సికమత సహాయమును ఆయువను పొంది యెల్లరును తమవాంఛలను తృప్తిపరచుకొందురు. ఓ స్వప్తిరా! యీమాపరిశుద్ధతను యుసట్టియు అంతర్గతమయినట్టియు యిచ్ఛను నెరవేర్పుమా



## 23 వ ధర్మోపదేశము

“ప్రేయశ్చ ప్రేయశ్చమనుష్య మేతస్తౌ। సంపరిత్య వివినక్తిధీరః”

“సంతోషము బుద్ధి రెండును మానవునకుసంభవించును. అయితే శాంతమనస్కులు క్రమముగా విచారించి వకదానినుండి వాటిని భేదపరతురు”

విషయాసక్తిచే ఇంద్రియసౌఖ్యములలోనుప్రపంచికసుఖంబులలోమునిఁగి వానివలన ఆకర్షింపబడినప్పుడు మనముకొట్టికొనపోవుచున్న ఆబలమయిన ప్రవాహమునకు యెదురుగా నడచుటకు మనకాబల మెచ్చటనుండి వచ్చినది మన యెల్లదుఃఖములకును ఆశలకును, యీలోకనిరీక్షణలకును, లోబడి సౌఖ్యమార్గములలో మనము ప్రవర్తించునప్పుడు మన హస్తమును పట్టుకొని ఆదౌర్భాగ్య దశనుండి యెవరు మనలను రక్షించి యీశ్వరుని పాదరేణువను దర్శనము చేయించుట వలన మన ఆత్మను మేలుకొలుపగిలరో ఆట్టిపరిశుద్ధపురుషుని ముఖమునుచూడజాలక యీ లోకముయొక్క కలకలములలో స్నేహితులతో మనము వడలుదెలియక యున్నప్పుడు మంచి సలహాపల్లను లాభకరమయిన సన్మార్గమును యె

వరు మనకు కనపర్చిరి? సౌఖ్య ఆకర్షణలును విషయ వాంఛలును బలమై మన హృదయమును మానసమును హరించునట్టి స్థితి వచ్చునప్పుడేమో ప్రతివారు తమమనస్సులో యోచించుడి? మనము భయప్రమాదములలో మునిగినప్పుడు ఆకష్టకాలములో మనవైపు చూచువారెవరును లేరా? లోకములో యితరులందరును మన ఆత్మను నాశనముచేయుటకు ఆలోచించునప్పుడు దేవుడు మనకు సహాయుడుగా రాడా? సుఖమునడి చిక్కుదారినుండి ఆయన ప్రకాశవంతమయిన సన్మార్గమునకు యెప్పుడు నడిపింపుడునో యని ఆయన వేచియుండుటలేదా? లోకమును మాత్రమే మనగొప్ప గమ్యస్థానముగా ఆలోచించునప్పుడును. అది సుఖానుభవించుటయందు యింద్రియములన్నియు ఆతురపడుచున్నప్పుడును మన ప్రేమయంతయు లోకమునకే పూర్తిగ చెందియున్నప్పుడును, అట్టి ఆకర్షణలనుండి దేవుడే మనలను కాపాడును అంతట ఆయన మన ఆత్మలోనికి విముఖత్వమును పంపును, అప్పుడు తెలివొందిన ఆత్మ తనను తాను యిట్లు అడిగికొనును, నేను యెచ్చటనుండి వచ్చుచుంటిని నే నెచ్చటకు వెళ్ళవలెను నే నేమిచేయుచుంటిని. యీ అల్ప విషయములనే నెల్లప్పుడును తగులుకొని యుండవలయునా? అప్పుడు ప్రపంచముయొక్క నిష్ప్రయోజనత్వమువలన వుండదు. మనహృదయములో చింతితమగును ఈశ్వరానుగ్రహమును పొందిననేతప్ప భూమి బంధమునుండి మనల విడిపించుకొనజాలమని మన కనుభవమగును. మనము వివిధశాస్త్రముల జదువవచ్చును. మహాత్ముల సహవాసములో మన దినములు గడుపవచ్చును. యింకను అడ్డగింపబడిన నీటిప్రవాహమువలె మనమానసము తిరిగితిరిగి ప్రపంచము వయిపునకు మళ్ళును మనము మనబు

ము నాధారపరచుకొనినప్పుడు యీ దౌర్భాగ్యమంతటనుండియు మన మేవిధముగా రక్షించబడుదుమో ఆశ యేమియులేదు. మరియొక విధము న యీశ్వరహస్తమును మనము దర్శించినప్పుడు ఆశ యెంతయుకలుగు ను. దేవునినుండి మనమేయాశయులేనట్టిస్థితిని మన మూహింపగలమా? మనము బాగుపరచబడుటకు అనర్హులగుటచూచి దేవుడు మనలవిడు చునట్టివాడుగలడా అది యట్లుండిన మనము అసహాయులమును ఆశా భంగులమును అయియుండెడివారము. అట్లనే ఆయన మన బలమువిశా దమాత్రమే ఆధారపరుచుకొనుటకు మనల విడిచియుండెనా? మనకెట్టి పాపమును దుర్మార్గమును సంపాదించినను ఆయన మనల దిద్దకుండిన అప్పుడు మనఆత్మ రక్షింపబడుట కెట్టి ఆశయునులేక యిదివరకే క్షీణిం చిపోయెడిదేగాని మన మెంత అనర్హులమయినను మనదేవుడు తనదీను లయి మలినసహితులయిన తనబిడ్డలను నిరాకరించునట్టి దేవుడుకాడు. ఇం కను ఆయనప్రేమ మనమీద అమృతధారలు కురియుచున్నది. సృష్టి అంతటిలోను ఆయనబిడ్డలలో ఆయనవలన విడువబడుటకు యెవరునులే రు. లోకమందలి బలమయిన తరంగములలో ఆయన ఓడ నడుపువాని వలెనున్నాడు, ఆయన యెప్పుడును మనతో సహవాసముగానున్నాడు అంతేకాదు ఆయన మనతో పనిచేయుచున్నాడు. ఆయన మన ఆత్మ లకు మహోద్దేశ్యమును కలిగించుచున్నాడు. బలపరచబడి లోకముతో పోరాడుటకు వలసినంతబలమును ఆయన ప్రసాదించుచున్నాడు మనకు కొంచెమాశక్తియుండిన నూరురెట్లు ఆయన బలమును కలిగించుచున్నా డు. మనము సుఖమును విసర్జించి జ్ఞానమును ఆధారపరుచుకొనిన యె

డల అత్యున్నత పర్వతములవంటియు అపార సముద్రములవంటియు ఆ
టంకములు కలిగినను లోకము మనకు విరోధముగా నడచినను మనకింక భ
యము లేదు. యేలనన దేవుడు మనకు సహాయుడయి యున్నాడు. మ
నంతట మనము దుర్బలులమయిన నేమి; దేవుడు దుర్బలులకు బలమై యు
న్నాడు. ఆయనను విసర్జించి లోకము మనసమస్తమని తలంచినప్పు
డు భయపడుటకు విశేషము కలదు. అప్పుడు అదే మన సౌఖ్యము అదే
మన నిరాశ, అప్పుడు మనము లోకములో మునిగిపోవుచున్నాము. అ
యితే లోకము మన హృదయమును తృప్తిపరుపజాలదు. మన ప్రేమయం
తయు మనము లోకమున కర్పింతుము; ఆయన ప్రతిఫలముగా మనము
యేమియు పొందము. మనము లోకమును సౌఖ్యదాయకమని భావింతు
ము అయితే సంతోషము యెండమావివలె మనల భ్రమపెట్టును. దాని
ని మనము అమృతమని తలచి సమీపింతుము. అయితే అది విషమువ
లె రుచించును. మన కష్టములతోడను మన దుఃఖములతోడను కష్టప
డుచున్నాము. మనము పాపములోను పశ్చాత్తాపములోను మునుగుచు
న్నాము. మన దేహము రోగము కలదగును మన మానసము దుర్బలమ
గును. యింకను మన మెచ్చట నిలచి బాధింపబడకుందుమో మన మెరు
గము. మనమందరమును ఈశ్వరుని ఆశ్రయమును చొచ్చెదము. సృష్టి
కంతయు శక్తియయిన ఆయన బలముతో బలపర్చబడి నిర్భయులముగా
నుందుము. సంతోషమార్గమును విడువుము. జ్ఞాన మార్గము నవ
లంబింపుము. దేవుడు మనకు సహాయుడయి యుండును. లోకమంతయు
ఆయన బలములోనున్నది. మన ప్రాణము ఆయన ఆశ్రయములో ను
న్నది. ఆసూర్యుని తేజము మనఆత్మలో ప్రకాశించినయెడల తక్షణమేమ

వము బలపర్చబడి నిలువబడి యుండును. ఆసూర్యుని దర్శనమువలన మన అల్పత్వ మంతయు అదృశ్యమగును. సూర్యుడు లేనప్పుడు చంద్ర కాంతి యేమియుండగలదా? ఈశ్వరుడు ఆవిర్భవించి ప్రకాశింప జేసినప్పుడు ఆహృదయములో నీచత్వమును దుర్మార్గమును యేమైనయునుండగలదా? అప్పుడు దాని సౌందర్యమును దాని గొప్పతనమును దాని బింకమును దాని ఆత్మగౌరవమును నిలుపుకొనగలదా: సూర్యుడస్తమించి ఆకసము అంధకారముగా నుండునప్పుడు మిణుగురు పురుగులు తమ సౌందర్యమును కనుపర్చును. అట్లే హృదయము అంధకారముగా నుండి యీశ్వర తేజము ఆపబడినప్పుడు మన నేత్రములు మన పేరు ప్రతిష్ట గొప్పతనము పైకి తిరుగును అప్పుడు అంధకారము రాత్రియందు మనఅల్పకాంతి తననుచూపించుకొనును. అయితే దేవుడు మనహృదయమును స్వాధీనపరచుకొనినప్పుడు మనలమనముగ మనింపము. అప్పుడులోకమంతటను ఆయనప్రాజనోల్లు వ్యాపింపబడునన్ననియు, ఆయన ఆనంద కిరణములు యెల్లహృదయములను యెల్లు అలంకరింపుననియు; సమస్తప్రదేశములలోను ఆయనప్రేమాజ్ఞానము లెల్లువ్యాపించుననియు. మనదేహమును మానసమును ఆశక్తికలవగును అప్పుడుమనలగూర్చి మనమాలోచించుకొనము; అయితే ఈశ్వరనుహిమను యెట్లుఅభివృద్ధి పరుపవచ్చునని మనప్రయత్నములన్నియు వుత్సహించును మనలమనము మరచి ఈశ్వరునిదర్శించునప్పుడు అదియే మననిజమైనఘనత. ఈశ్వరునిమరచి మనలమనముగమనించునప్పుడు లోకముయొక్క అల్పత్వములో మనము మునిగిపోదుము

విడిపించి యెవని దర్శనము నీకు శాశ్వతసుఖమును ప్రసాదించునో ఆ సుందరుడయిన ఆనందస్వరూపుని జూచియున్న హస్తములయొద్దకు నిన్ను తీసికొని వెళ్లును. జ్ఞానమార్గమును మనమనుసరించిన మతమనెడి అమూల్యరత్నంబును పొందగలము, ఈశ్వరుని సుఖాకారమును చూడగలము, ఆయనతోడ మీదకూర్చుండి దానివలన కలుగు పరిశుద్ధమైన బ్రహ్మానందమునొందగలము. జ్ఞానమార్గము మానవపథమైయున్నది; జ్ఞానమార్గము ఈశ్వరపథమైయున్నది; జ్ఞానమార్గము శాశ్వతకాలము మనమార్గమైయున్నది. కావున దానినవలంబించి సౌఖ్యమార్గమును దూరముగా విడుతుముగాక. తరుణవయస్కులగు సోదరులారా జాగ్రతగానుండుడు. యౌవనప్రారంభమునుండియు మీపనుల జాగ్రతగా ముందరికి వేయుడు. యీ కాలములో మీజ్ఞాననేత్రము తీక్ష్ణముగా నుండును. మీ దేహమును మానసమును బలముతోడను నుత్సాహముతోడను కూడుకొని యుండును. పచ్చనిగడ్డితో కప్పబడినట్టియు అంధకారముతో నిండినట్టియు కోపములో ఈకాలములో పడకుండుటకు చూడుము. జ్ఞానము యేమి సలహా నిచ్చుచున్నదో వినుము; జ్ఞానముతో నిండి యీశ్వరమతమునకు అది నన్ను తీసికొని వెళ్ళెదనని చెప్పుచున్నది.

సౌఖ్యమునకును జ్ఞానమునకును మన హృదయములో గొప్ప పోరాటము జరుగుచున్నది. యీ రెంటికిని మధ్య మనము నిలచియున్నాము. ఒకవంపు సౌఖ్యము మన పాదమును బంధముతో ఆకర్షించి ఐహికసముద్రములో ముంచుటకు కోరుచున్నది. మరియొక వయిపున జ్ఞానము మాతృప్రేమతో కూడినదయి మన హస్తమును పట్టుకొని అమృత

ప్రదేశములకు నడపించుటకు యిచ్ఛయించు చున్నది. హృదయములో వివమునుం మకొని సుఖము మధురస్వరముతో నిట్లనుచున్నది, “శతాయుషః పుత్రః పౌత్రాం వృణీష్వబహూన్‌బహూన్‌హస్తిహిరణ్యమస్వాన్ “శతాయుష్మంతులయిన పుత్రులును పౌత్రులును అశ్వములును గజములును రథములును కాంచనమును నీవు కలిగియుండుదువుగాక” నీవునా మార్గమునరమ్ము. మధురమయిన సువాసనగల మందమారుతము నీ దేహమును చల్లపరచును. అందరు పాడుచూ నవ్వుచూ హాస్యములు పుచూ సంతోషవార్తలు నీమందిరములోనికి కొనివచ్చును. మంచిసువాసనలు మీహృదయమును సంతోషపరచును. లోకమందలి సుందరవనితలు నిన్ను కని పెట్టుకొని యుందురు. జనులందరును నీకు విధేయులగుదురు విశేష ప్రదేశములకు నీవు రాజుగానుందువు నీకీర్తి అంతటను వ్యాపించును. నీవు నన్ను గ్రహించిన నీవు సమస్తమునకును ప్రభువు అగుదువు. శాంతమనస్కులను పరిశుద్ధాత్ములనయిన తరుణవయస్కుడుయీ ప్రమాదకరమయిన పలుకుల నాకర్షించి సముద్రమువలె గంభీరుడయి నిస్సందేహముగా యిట్లు జవాబు చెప్పును.

“సర్వేంద్రియాణాం జరయంతి తేజః” నేను నీసలహాను అనుసరించిన నాయింద్రియములన్నియు త్వరలో నశించిపోవును. మరణము నా ప్రక్కన దాగియున్నది. దానికి పట్టు చిక్కినంతనే అది నాప్రాణమును హరించును కావున నీగుర్రమును నీబండిని నీపాటను నీఆటను నీవేవుంచుకొమ్ము. నీవు ఇవ్వగలిగినదే నీతోడను నేను తృప్తిపొంద జాలను” “నవిత్తేన దర్పణీయోమనుష్యః” మానవుడు ధనముతో తృప్తి పొంద

వలసినవాడు కాడు. వాడు నీశోధనవలన సులభముగ చలింపబడెడివా డు కాడు. నేను నాహృదయమును క్షణభంగురమయిన క్షుద్రపదార్థ ములయందు నిలుపజాలను. లోకము భూతకాలమునందు యేసౌఖ్యము ను యిచ్చియుండలేదని నాఅనుభవములోనే నెరుగుదును. అయితే అ ది నన్ను దుఃఖముతోడను ఆశతోడను చంచలము చేసెను. భవిష్యత్ కాలమందును యీలోకము శాంతిని సుఖమును యివ్వదని నిశ్చయము గా నేనెరుగుదును. కావున శోధనను కలిగించెడు సేవకులవలన మో సపోయి లోకముయొక్క బంధకరమగు ఐహికమార్గమును పరిత్యజిం చుటకు నేనిచ్ఛగింపను. దేవునియందు నాప్రేమనుంచిన నేను యితరము యిన సమస్తమును ప్రేమింపగలను. జేసుచేత నాహృదయమందలి ప్రే మయంతయు పూర్ణముగా నుపయోగింపబడి యేకాలమునందును క్షీ ణత్వమునొందదో అట్టి సుందరమయిన అమూల్యపదార్థము నీయొద్ద నుండినదాని నాకిచ్చి నాఆశను శాంతిపొందింపుమా; అప్పుడు నాజీవిత కాలమంతయు నేను నీకు దాసునిగానుండెదను. యింకనుమీద సౌఖ్య ము మౌనమువహించి వెడలిపోయెను. అంతట అపరిశుద్ధుడగు తరుణవ యస్కుడు ఒంటరిగా విడువబడి అంధకారముతోడను, నిరాశతోడను ఆవరింపబడి నిరాశుడయ్యెను ఐహిక సుఖమునందలి సాధనలు కాని వి డచిపోయెను. ఆయన వానిహృదయ వాంఛలు తృప్తిపొందలేదు. ఐహి కాముష్మిక సౌఖ్యములకు దూరుడయి దుఃఖసముద్రములో మునిగి పో యెను. లోకము వానికి శ్మశానవాటికయయి కనపడెను. అట్టిజీవితకా లమెంత భయంకరమయినది. ఐహికసౌఖ్యములు వాని ఆకర్షణంత

యు పోగొట్టుకొనెను. అయితే మనము బ్రహ్మానందము అనుభవింప జాలము. ఈశ్వరునికొరకు బలమయిన యిచ్ఛ వుదయించినది. ఆయన ఆ హృదయపూర్ణమయిన యిచ్ఛను యెట్లుతృప్తిపరచవలయునో తెలియలేదు యిట్టికాలమందు దాహముతో బాధలేదు. లేశివలె మన హృదయమందు మనము చంచలమగుదుము. మనదేహమంతయు ప్రాపయ తాగ్నిలోమండు చుండును. యీదుఃఖాగ్నినుండి మనల రక్షించుకొనుటకు ఆసక్తిగల హృదయముతో మనము విచారింతుము. అయితే యెవనినుండియు ఓదార్పునట్టియు వుత్సాహము గల్గించునట్టియు ప్రత్యుత్తరము మనము పొందము. అట్టి సందిగ్ధస్థితిలో పరిశుద్ధుడయిన తరుణవయస్కుడు విచారపడుచు దుఃఖించుచు నిరాధారుడయి ప్రాణమునకు సహాయుని వెదకుచుండగా శ్వేతవస్త్రధారియయి కరుణాసహితమయిన జ్ఞానము వానియెదుట కనుపడి ఓదార్పుమాటలనుబలికెను

నీవు దుఃఖముతో లోతుగామునుగుచున్నావు నీవు దుఃఖముతో బాధపడుచున్నావు నీవు చంచలుడవయి అడవిలో దిరుగుచున్నావు. ప్రేమాస్వరూపుడయి యెవని అమృతమయిన ప్రేమవలన ప్రపంచమంతయు కాపాడబడుచున్నదో నీదుఃఖముయొక్క కన్నీటిని ప్రేమాబింధువులుగ నెవరుమార్చగలరో వాని సుఖాకారమును చూడుము ఆయన ప్రేమయందు మగ్నమగుటవలన నిన్ను నీవు శాంతిపరుచుకొనుము. ఆయనను ప్రేమించుటవలన ప్రేమయంతయు తృప్తినొందుచున్నది అది యెప్పటికిని చెడదు. ఆయనతో యొక్కసారి యేర్పరుచుకొనిన బంధము యెన్నటికిని అంతరింపదు, మాయనిద్రనుండి లేచి మేలుకొనుము. నాన

హాయము నంగీకరించుము. ప్రేమతో నిండినట్టియు అంతేకాదు ప్రేమా స్వరూపుడయినట్టియు ఆయన అమృతహృదయముతో నిన్ను సంబంధింప చేసెనను జ్ఞానముయొక్క జీవవంతములయిన ప్రియ వాక్యములతో ఆ తరుణవయస్కుని మానసము కరగిపోయెను. ఆతురతపడుచున్న హృదయముతో వాడు దాని నిట్లు అడిగెను. నీవెవరు. నీవెచ్చటనుండి వచ్చుచుంటివి. భరింపశక్యముగాని యీ ఆశను శాంతిపరచుటకు నేనేమి చేయవలెను. నేనెచ్చటకు వెళ్ళవలెను? యెవని ప్రేమాబంధమునకైన నా కృశించుచున్న హృదయము అభివృద్ధి పరచబడును హృదయమందు సర్వదా వుండునట్టి ఆఘనుని నీ అల్పఆత్మను ఆశ్రయించినప్పుడు ఆ అనంతుడయిన శాశ్వతపురుషుని చూచుమని జ్ఞానము దయగల స్వరముతో జవాబు చెప్పెను. ఆశగలిగిన హృదయముతోడను దీనమయిన మానసముతోడను ఆయనను చూచుటకు ప్రార్థించుము ఆయన నిశ్చయముగా తన ఆనంద తేజమును ప్రకాశింపజేసి నీయెదుటనుండెడి స్పష్టమయిన మతాచరణమును నీవు కనుగొనుటకు సహాయపడును. మనుష్యులు పూర్వకాలపు మహాత్ములు మంగలికత్తి అంచువలె పదునయిన మతాచరణము దాట నశక్యమని తెల్పియున్నారు, దేవుని ఆశ్రయమును నీయంతట నీవు చేరుము ఆదాటనశక్యమయిన మార్గము సుగమమగును మతాచరణమునను సరించుటకు నీవు కష్టసుఖములయందు ఆశలేనివాడవు అయివుండవలెను.మతము సుఖమునందును కష్టమందును వృద్ధినొందవచ్చును మతము వృద్ధియందును క్షీణతయందును పెరుగవచ్చును.మతము కష్టములోనున్న వానిని కాపాడును; వృద్ధియందున్న సత్పురుషుని కాపాడునదియు మతమే. యీ లోకము మన నియమితస్థానము కాదు; యిది సాధనయొక్కయు శోధన

యొక్కయు ప్రదేశము. మతము కొరకు సర్వము బాధనొంది అపాయములను కష్టములను పొంది స్వసుఖమును గమనింపకుండుట నైజమే; అంతేకాదు కొన్ని సందర్భములలో కొన్ని వేళల దేవుడట్లు యిచ్ఛయించెనేని మనము ప్రాణముసహా సర్వంశయముగా అర్పింపవలెను సౌఖ్యభ్రమచే మతము ననుసరించుట అక్రమమును దుర్వ్యయమును అయియున్నది నేను మీకు సుఖమును వాగ్దానము చేయను. నేను మిమ్ములను సంతోషమువంటి భ్రమలచే బంధింపను. మతము సుఖమునందును వృద్ధినొందించుననుట నిజము; అయితే సుఖము యెప్పటికిని మతమునకు ఫలము కాజాలదు. క్షణికమైన ఐహిక సుఖము ఈశ్వరేచ్ఛచే అవలంబించెడు మతమునకు ఫలము కాగలదా? ఐహికధనముచే కొలతగినదియు దేహము నాశ్రయించినదియు మోహముచేనహితము పొందతగినదియు నైన అసుఖము మతమునకు ఫలము కాగలదా? మతమునకు మతమే ప్రతిఫలము; ఆత్మశాంతియే మతమునకు ప్రతిఫలము; ఈశ్వరుడే మతమునకు ప్రతిఫలము. కావున నీహృదయప్రేమను ప్రకాశింపజేయుము; నీ అల్పత్వమును విడచి నీహృదయప్రభువును చూడుము. ఆయన ఆలోచనలో నిండియుండుము. నీకొరకు దేనిని యుంచుకొనవద్దు; అయితే సమస్తమును ఆయన కర్పణచేయుము. ఆయనను చూచుటవలన నీవు ధన్యుడవగుదువు. ఆనందప్రదమైన జ్ఞానముయొక్క యీ గంభీరమగు హితవాక్యము లాకర్ణించి తరుణవయస్కుడు సమస్తమునకును ముఖ్యాధారుడయిన యీశ్వరుని ఆశ్రయమును జొచ్చెను; వాడు తన హృదయమందు ఈశ్వరుని దర్శించుటవల

న ధన్యతనొందెను. లోకము దానికి నూతనమైనట్టియు అత్యానందకర మైనట్టియు ఆకారమును దాల్చెను; పూర్వము వ్యర్థముగా నున్నది పూర్ణమయ్యెను, అమృత స్వరూపుడయిన పరమేశ్వరునియందు తన ప్రాణమునుంచి మృత్యుహస్తములనుండి విడివడి వాడు శాశ్వతత్వమును పొందెను: జ్ఞానమునకు పథేయులయి యింక నెవరయినను తమప్రాణం బుల యీశ్వరునియందు నిలిపి ప్రవర్తించినట్లయిన శాశ్వతత్వమును పొందుదురు.



25 వ ధర్మోపదేశము.

"అమృత స్వరూపం సేతుం తిక్ తేం ధనము వానలం"

"శాశ్వతత్వము నొందుటకు ఆయన పుత్కృష్టమయిన సేతువు; ఆయన మండెడు కట్టెనుండి వెలిగెడు అగ్నివంటివాడు"

శాశ్వతత్వమును పొందుటకు ఆయన వుత్కృష్టమయిన సేతువు; అయితే ఆయనను శాశ్వతత్వమునకు సేతువు అని పిలుచుటవలనమాత్ర ము ఈశ్వరతత్వమును పూర్ణముగ వివరింపజాలము ఆయన శాశ్వ తత్వమునకు స్థానము. ఆయన శాశ్వతత్వమే. యీభక్తుల సమాగమ మునుండి పరిశుద్ధమైన ఈశ్వరస్తోత్రములు పైకి పంపబడుచున్నట్లు యీ ప్రార్థనామందిరమునందంతటను అమృతధారలను కురిపించుచున్నాడు దినమంతయు పండ్రెండుగంటల కాలమును యిహలోకసుఖమువెడి విష మును గ్రోలుచున్నాము; దీనికి అనుపమముగ మన హృదయములోనికి

తుదకు ఆశాశ్వతత్వ పుదకబిందువు నొక్కడాలినయినను ప్రవేశింప చేతుము గాక. ఆయన యిచ్చు నిరంతరము శాశ్వతోదకములను వర్షించుచున్నాడు; మానవహృదయ ప్రదేశమును విశాలము చేసి మనచేతనైనంతదానిని సంగ్రహింపనీయుము గాక. భౌతిక వస్తువులవలె మనమిచ్చట వడముయ గానుంచిన కొలదికాలమయినను శాశ్వతోదకములు మన హృదయములోనికి గ్రహింపజాలకున్న స్తోత్రములవాక్యములను పరిశుద్ధ పురుషుల సహవాసములోను ఈశ్వరుని యిట్టిదివ్య ఆవిర్భావమునందు నుండియు, మనమెట్టును ప్రేమోదకములు నింతగా వర్షింపుచున్న ఆయనకు నొక్క ప్రేమబిందువునైనను తిరిగి చూపజాలకున్న శాశ్వతత్వమునకు ఆసుందరుడయినట్టియు ఆధారుడయినట్టియు, అనింద్యుడయినట్టియు, నిష్కల్మషుడయినట్టియు. పరిశుద్ధుడయినట్టియు పరమేశ్వరుని పొందుటకు మానమేము చేయుచున్నాము? మనల నాయన ప్రేమతో కౌగలించుకొనవలెయుననియు మనము తిరిగి ఆయనను ప్రేమతో కౌగలించుకొనవలెయు ననుటకంటె మనకేమి అధికక్షేమము కలదు; యీభాగ్యమునకే మనము పుట్టుచున్నాము; కావున మన ప్రాణజీవమును వయస్సును ప్రేమాపూర్ణమైన హృదయముతో ఆయనహస్తములలో నర్పించుటవలన మనజీవితముయొక్క పరమార్థమును సాధింతుముగాక యెవని కౌగలించుకొనుటకు సర్వదా మనమానసమింత ఆతురపడుచుండునో, ఒక క్షణమయినను యెవనిదర్శనము లేకపోవుటవలన మనదేహము కృశించి మన ఆత్మ భ్రమనొందునో ఆ పరమపురుషుని ప్రేమాపూర్ణములయిన నేత్రములతో మనవంక చూచుచున్నాడనుట యెంత యదృష్టమో యొక్కసారి ఆలోచింతుము. ఆయన మన్నైపు చూచు

టమాత్రమేకాదు అయితే ఆయన సర్వదా మనల కౌగలించుకొనుచు నహావున్నాడు. మన ప్రేమ ఆయనవయిపు లేచినప్పుడు ఆయన ప్రేమా కౌగలిని మనమనుభవింతుము; యీమృత్యుప్రదేశమును విడచి దేవతానివాసమునకు అంతకంతకు దూరముగా మనమునడచి వెళ్ళునప్పుడును దేవతల యొక్క లోకమునుండి మరియొక లోకమునకు వెళ్ళునప్పుడును ఆయనప్రేమ అంతకంత కెక్కువ ప్రత్యక్షమగును. ఆయిన మనల తన కౌగలియందు అంతకంత కధికముగ బిగించును. మనముకూడ ఆయనను మన కౌగలియందంతకంతకు అధికముగా బంధింతుము. యీజీవనంతమయిన ఆశను పోగొట్టుకొనిన జీవితము మాకింక వ్యర్థమయినదగును. ఓ మహాత్మా; ఆయన ప్రకాశమానమయిన ఆకారము యెట్లావిర్భవించుచున్నదో చూడుము. ఆయన జ్ఞానతేజస్సు అంతటను వ్యాపించుచున్నది. ఆయన తేజము బాహ్యాంతరములయందు కలదు. స్వయాంభువయిన ఆ తేజము యెదుట మెరుపుతీగయొక్క ప్రకాశము సహితము కనుపడదు సూర్యుని తేజము మరుగియుండును. ఆగంభీరమయిన తేజమునకు అంతములేదు; ఆ గంభీరమయిన తేజమునకు హద్దులేదు; అది నిరవధిక వెలుగు; దానినుండి ఒక రేణువును పొంది సృష్టియంతయు ప్రకాశమానమయ్యెను. ఆయన "త్రైంధనమివానలం" అయి వున్నాడు మండుచున్న కట్టెనుండివచ్చెడి అగ్నివలె ఆయన వెలుగుచున్నాడు. కట్టెయందు ప్రవేశించెడి అగ్నిలోపలను వెలుపలనువుండి జ్వాలలుబయలుదేరులాగున పరమాత్మయొక్క అగ్ని సృష్టియొక్క బాహ్యాంతరములయందు ప్రతిభాగమునందును ప్రతి రేణువునందును వెలుగుచున్నది; యీ భూప్రదేశమునుండి అనంతమయిన ఆకాశమున అవలేచి దేవతా ప్రదేశమునుమించి అనంత సృష్టినంతటనుండి ఆవిర్భవించుచున్నది. ఆయన తేజముగల ఆత్మను అంతటనుచూడుము. నీవాయనను కనుగొనుటకు

నిరాశజెందితివేని, నీకెచ్చటనయినను యేమి ఆశవున్నది. " యీ స్థలములో పరిశుద్ధపురుషుల మధ్యమున సూర్య తేజమువలె ప్రకాశింపుచున్న ఆయన ఆవిర్భావమును నీలో కనుగొనకుండిన జీవితముతో నేమి ప్రయోజనము? జీవితము నింద్యము. భాగ్యము నింద్యము, గౌరవము, కీర్తి, అధికారము నింద్యము. ఓపరిశుద్ధులగు తెనుఁగునయున్కలారా! ఆతురతగలహృదయములతో మీరందరును ఆయననొక్కసారి కనుగొనుటకిచ్ఛయించెదరా? మీహృదయములు రాళ్ళంత కఠినముగా నుండినను యీశ్వరానుగ్రహమువలన పుష్పములయంత మృదువులయిన వగును; యిచ్చట నిన్నేదుష్టతలంపును కలవరపరచకుండును గాక. జ్ఞానమార్గము నవలంబింపుము. దేవుడే రక్షకుడుగాను ఆ మార్గము ననుసరింపుము. ఆయన ఆశ్రయమునజేరుము. ఓపరమాత్మా నీవు సహాయుడవు మాధనమవు; నీవు మాప్రియస్నేహితుడవు, నీవు మాతండ్రివి తల్లివి నీవు మా ఆత్మకు దారిచూపువాడవు నీవు మారక్షకుడవు నీవు మాశ్రయము నీవు మాప్రేమను నీవయిపు వ్యాపించునట్లుచేయుమా! మావుద్దేశముల నన్నిటిని నీ ఆనందస్వరూపమును ననుసరించునట్లుచేయుమా నాశక్తులన్నిటిని నీవలన పొందితిమి దానిని నీసేవకయి వినియోగింతుముగాక మా కార్యము లేమార్గమును ననుసరించునో ఆపథమున నీదృష్టిని సర్వదా మేము కనుగొందుముగాక! ఓపరమాత్మా నీసన్మార్గమునకు మమ్ము త్రిప్పుమా; మాజ్ఞాననేత్రము మొకటి నీవు ఆవిష్కరింతువుగాక నిన్ను నేము ప్రార్థించుటకింకేమిగలదు?

"ఏకం యేవా ద్వితీయం బ్రహ్మ"

ఒం, రెండుగాక ఒక్కటియునది బ్రహ్మము.

సమాప్తము.



## శంకర వెంకటరామయ్యగారిచే రచియింపఁబడిన

## గ్రంథములు.

### మతసంఘ విషయకోపన్యాసములు.

1 బ్రాహ్మమతము స్వాభావికమతము 2 మతజ్ఞానాభివృద్ధి 3 బ్రహ్మసమాజోద్దేశ్యము 4 శ్రీకృష్ణోపదేశము 5 పరబ్రహ్మస్వరూప నిరూపణము 6 బ్రాహ్మమత ధర్మములు 7 స్వదేశవస్తుప్రేరేపణము 8 మాంసభక్షణము 9 సంఘసంస్కరణ మన నేమి రోఁల 10 నిర్బంధ వైధవ్యము 11 "నష్టే మృతే'త్యాది వాక్యార్థ విచారము 12 జనోపకారము, దీని వెల (పోస్టేజిగాక) రు 0 8 0

### మన ప్రస్తుత స్థితి.

విషయములు.

1 మనప్రస్తుతస్థితి 2 హిందూదేశదారిద్ర్యము 3 హిందూదేశ దారిద్ర్యకారణములు 4 ప్రభుత్వములో పలుకుబడలేదు 5 బహిష్కారము రాజకీయ శస్త్రము 6 బహిష్కారము స్వదేశపట్టుడి 7 స్వరాజ్యము 8 స్వరాజ్యము సాధించుకొను దీనివెల (పోస్టేజిగాక) రు 0 4 0

### మహర్షి దేవేంద్రనాథ ఠాకురిగారి ధర్మోపదేశములు.

విషయములు.

ఉపనిషదుద్ధృతములును, సర్వమతసమ్మతములును, భక్తజనాహ్లాదకరములును, దేశవిఖ్యాతి మహర్షి దేవేంద్రనాథ విరచితములును నగు 25 ధర్మోపదేశములు మొదటిసారి తెలుగున ప్రచురింపఁబడినవి. పరిశుద్ధాస్తిక యేకేశ్వరతత్వమును, మానవతరు గౌరవమును, విషయవాంఛా విముఖత్వమును, పాపవిరహితత్వమును, ఆత్మపారిశుద్ధ్యము ఆత్మశాంతి మొదలగు దివ్యవిషయములగూర్చి కేవల అనుభవప్రసిద్ధుఁడగు మహర్షి బోధించిన యీయుపదేశములు భక్తులగువారికెల్లకును పరమప్రయోజనములని వేఱు చెప్ప నక్కరలేదు. దీనివెల (పోస్టేజిగాక) రు 0 8 0

ఈ గ్రంథములు అనేకపత్రికల సదభిప్రాయములనందియున్నవి.

బెజవాడ,
1—12—1909.

శంకర వెంకటరామయ్య,
అరండల్ పేట,

